# చైనా - రష్యా విభేదాల పుట్టు పూర్వోత్తరాలు



రచన :

"పీపుల్స్ డెయిలీ", "రెడ్‌ఫ్లాగ్" పత్రికల
సంపాదకవర్గాలు, సెప్టెంబరు 6, 1963



జనశక్తి ప్రచురణలు
అమరావతి రోడ్డు, గుంటూరు-2

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఏర్పడిన సిద్ధాంత విభేధాలను వివరిస్తూ కామ్రేడ్ మావో నాయకత్వాన చైనా కమ్యూనిస్టు పార్టీ బృహత్తరమైన (గ్రేట్ డిబేట్) చర్చకు నాయకత్వం వహించింది. కృశ్చేవ్ నాయకత్వాన సోవియట్ కమ్యూనిస్టు ఆధునిక రివిజనిజాన్ని ప్రతిపాదించి ఆచరించ మొదలెట్టిన నాటినుండి చైనా కమ్యూనిస్టు పార్టీ సోవియట్ పార్టీ సిద్ధాంత వైఖరులను ఎండగట్ట సాగింది అందులో భాగంగా 9 వ్యాఖ్యానాలను వరుసగా ప్రకటించింది. అందులో మొదటిదే ఈ పుస్తకం.

ప్రస్తుతం చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన బృహత్తర చర్చ నాటి వైఖరులను తిరగదోడ సాగింది. ఆధునిక రివిజనిష్టు మార్గంలో ప్రయాణం మొదలెట్టింది. కనుక మరొకసారి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఎదుర్కొంటున్న అనేక రాజకీయ సిద్ధాంత సమస్యలను అర్థం చేసుకొనడానికి ఈ తొమ్మిది డాక్యుమెంట్లను ప్రచురిస్తున్నాం.

1. చైనా-రష్యా విభేధాల పుట్టు పూర్వోత్తరాలు
2. స్టాలిన్ సమస్య సరైన అంచనా ఏది?
3. యుగోస్లావియా సోషలిష్టు దేశమేనా ?
4. నయావలస విధాన వకాల్తాదారులు
5. యుద్ధమూ-శాంతి సమస్య యెడల-మార్క్సిస్టు-లెనినిస్టుల వైఖరి
6. శాంతియుత సహజీవనం-రెండు పరస్పర వ్యతిరేక విధానాలు
7. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటలకు కారకులెవరు?
8. కార్మికవర్గ విప్లవం-కృశ్చేవ్ రివిజనిజం
9. కృశ్చేవ్ బూటకపు కమ్యూనిజం – ప్రపంచానికి అది నేర్పుతున్న గుణపాఠాలు

ఈ తొమ్మిది డాక్యుమెంట్లు పాఠకులకు నేటి అంతర్జాతీయ పరిస్థితిని అవగాహన చేసుకొనడానికి ఉపకరిస్తాయనే ఆశతో మేమీ కర్తవ్యాన్ని చేబట్టాం. మా యీ కృషికి పాఠకులు మాతో సహకరించగలరని ఆశిస్తున్నాం.

1-10-1992,
గుంటూరు.

విప్లవాభినందనలతో,
జనశక్తి ప్రచురణకర్తలు

# విషయసూచిక

# ప్రకటన

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ క్రింది శాఖలను, సభ్యులను ఉద్దేశించి 1963 జూలై 14న ఒక బహిరంగ లేఖను ప్రచురించింది.

జూలై 19న చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రతినిధి ఇలా చెప్పారు:

"జూన్ 14న మేము రాసిన లేఖకు సమాధానంగా సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ బహిరంగలేఖ రాసింది. బహిరంగ లేఖలో విషయాలకు వాస్తవాలతో సంబంధం లేదని చైనాపార్టీ కేంద్రకమిటీ భావిస్తున్నది; బహిరంగలేఖ వెలిబుచ్చిన అభిప్రాయాలను ఆమోదించ లేకుండానూ ఉంది. తగిన సమయం వచ్చినప్పుడు, చైనాపార్టీ కేంద్రకమిటీ వాస్తవాలను స్పష్టం చేస్తుంది; తన అభిప్రాయాలను వెల్లడిస్తుంది."

సోవియట్‌పార్టీ బహిరంగ లేఖను మా 'పీపుల్స్ డెయిలీ' చైనాలోని అన్ని జాతీయ రాష్ట్ర, మునిసిపల్ పత్రికలూ జూలై 20న ప్రచురించాయి. చైనా రేడియోకేంద్రాలన్నీ బహిరంగలేఖను పూర్తిగా ప్రసారం చేశాయి.

బహిరంగలేఖ తర్వాత సోవియట్ పత్రికలు చైనాపై దాడిచేస్తూ 300 వ్యాసాలు ప్రచురించాయి. అలాంటి అనేక వ్యాసాల భాగాలను 'పీపుల్స్ డెయిలీ' ప్రచురించింది.

సోవియట్‌పార్టీ బహిరంగ లేఖపై 'పీపుల్స్ డెయిలీ', 'రెడ్‌ఫ్లాగ్' పత్రికలు ఈ వ్యాసంతో ప్రారంభించి వ్యాసావళిని ప్రచురిస్తాయి.

—'పీపుల్స్ డెయిలీ', 'రెడ్‌ఫ్లాగ్' పత్రికల
సంపాదకవర్గాలు, సెప్టెంబరు 6, 1963

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికి మాకు గల భేదాభిప్రాయాల పుట్టుపూర్వోత్తరాలు

# సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ బహిరంగ లేఖపై వ్యాఖ్య

'పీపుల్స్ డెయిలీ', 'రెడ్‌ఫ్లాగ్' పత్రికల సంపాదక వర్గాలు సెప్టెంబరు 6, 1963.

పార్టీ శాఖలను, సభ్యులను ఉద్దేశించి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ జూలై 14న బహిరంగ లేఖను ప్రచురించి ఇప్పటికి నెల దాటింది. ఈ బహిరంగలేఖా, సోవియట్ పార్టీ నాయకత్వం ఆ తర్వాత తీసుకొన్న చర్యలూ కలిసి చైనా, సోవియట్ సంబంధాలను తెగిపోయే దశకు తీసుకు వెళ్ళాయి; అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోగల విభేదాలను ఇంతకు మునుపెన్నడూ లేనంత తీవ్రతరమైన నూతనదశకు తీసుకు వెళ్ళాయి.

ఇప్పుడు మాస్కో, వాషింగ్టన్, న్యూఢిల్లీ, బెల్గ్రేడ్‌లు కలిసి విందారగిస్తున్నాయి; చైనాపై దాడి చేస్తూ వింతవింతైన కథలు, సిద్ధాంతాలు సోవియట్ పత్రికలు ప్రచారం చేస్తున్నాయి. సోషలిస్టు చైనాకు, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకు వ్యతిరేకంగా అమెరికా సామ్రాజ్యవాదులతోనూ, భారతదేశ అభివృద్ధి నిరోధకులతోనూ విద్రోహి టిటో గ్రూపుతోనూ సోవియట్‌పార్టీ నాయకత్వం మిలాఖత్ అయింది. ఆ విధంగా మార్క్సిజం, లెనినిజంకు, కార్మికవర్గ అంతర్జాతీయతకు బాహాటంగా ద్రోహం చేసింది; 1957 మాస్కో పత్రానికి, 1960 ప్రకటనకూ బహిరంగంగా తిలోదకాలిచ్చింది; చైనా-సోవియట్ స్నేహ పరస్పర సహకార సంధిని బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ, చైనా-సోవియట్ పార్టీల మధ్యనూ ప్రస్తుతమున్న భేదాభిప్రాయాలు, ముఖ్యమైన సిద్ధాంతాలకు సంబంధించి నట్టివి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి జూన్ 14న వ్రాసిన లేఖలో విభేదాలను గురించి క్రమబద్ధంగాను, సమగ్రంగానూ చైనాపార్టీ కేంద్రకమిటీ చర్చించింది. ప్రస్తుత భేదాభిప్రాయాలను బట్టి చివరకు తేలుతున్న దేమంటే, 1957 పత్రం, 1960 ప్రకటనల్లోని విప్లవ సిద్ధాంతాలను అంగీకరించడమా, లేదా? మార్క్సిజం-లెనినిజాన్ని, కార్మికవర్గ అంతర్జాతీయతను ఆమోదించడమా, లేదా? విప్లవాల అవసరం ఉన్నదా? లేదా? సామ్రాజ్య వాదాన్ని వ్యతిరేకించాలా, లేదా? సోషలిస్టు శిబిరంలోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలలోనూ ఐక్యతను కోరుకోవాలా, లేదా? విభేదాలసారమిదేనని జూన్ 14 లేఖలో చైనా కేంద్ర కమిటీ చెప్పింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం లోనూ, సోవియట్ పార్టీ నాయకత్వానికీ, మాకూ మధ్య విభేదాలు ఎలా తలెత్తాయి? నేటి తీవ్ర దశకు అవి ఎలా వెళ్ళాయి? ఈ ప్రశ్నలు అందరినీ ఆందోళన పరుస్తున్నాయి.

"విభేదాలు ఎప్పుడు మొదలయ్యాయి? ('పీపుల్స్‌డెయిలీ' సంపాదకీయం, ఫిబ్రవరి 27, 1963) అన్న మా వ్యాసంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో తలెత్తిన భేదాభిప్రాయాల పుట్టుపూర్వోత్తరాలను గురించి మేము స్థూలంగా చర్చించాము. ఈ సమస్యను గురించి, ప్రత్యేకించి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికి సంబంధించిన కొన్ని వాస్తవాలను మేము ఉద్దేశ పూర్వకంగానే బయటపెట్టలేదు; పూర్తి వివరాలను అందజేయటానికి మేమప్పుడే సిద్ధంగా ఉన్నప్పటికీ, అవసరమైనప్పుడు బైట పెట్టవచ్చునన్న ఉద్దేశంతో సోవియట్ నాయకత్వానికి కొంతవెసులుబాటు కల్పించాము. ఇప్పుడు సోవియట్ బహిరంగలేఖ విభేదాల పుట్టుపూర్వో

త్తరాలను గూర్చి అనేక అబద్ధాలు చెపుతూ, వాస్తవాలను తారుమారు చేయ ప్రయత్నించింది గనుక విషయాలను మరికొంత వివరంగా చెప్పేందుకై కొన్ని వాస్తవాలను బహిర్గత పరచవలసి వచ్చింది.

తన పార్టీ సభ్యులకు, ప్రజా సామాన్యానికీ బహిరంగ లేఖ ద్వారా వాస్తవాలను చెప్పే ధైర్యం సోవియట్ నాయకత్వానికి లేకపోయింది. నిజాయతీగానూ, నిష్కల్మష మనస్సుతోనూ మార్క్సిస్టు-లెనినిస్టుల్లాగా వాస్తవాలను గౌరవించవలసిందిపోయి, బూర్జువా రాజకీయ వేత్తలకు అనవాయితీ అయినట్లుగా వాస్తవాలను తారుమారు చేస్తూ, వాస్తవాలను అబద్ధాలనూ రెంటినీ గందరగోళ పరుస్తూ విభేదాల వుట్టుపూర్వోత్తరాల బాధ్యతను చైనా కమ్యూనిస్టుపార్టీ మీదనే మోపాలని ప్రయత్నించింది.

"రాజకీయాల్లో నిజాయితీ శక్తివల్ల వస్తుంది; కపటనాటకం బల హీనత యొక్క ఫలితమే", అని లెనిన్ ఒకానొకప్పుడు అన్నారు. నిజా యతీ, వాస్తవాలను మన్నించడం మార్క్సిస్టు-లెనినిస్టులకు గీటురాయి. రాజకీయంగా దిగజారిపోయినవారే బ్రతుకుదెరువు కొరకై అబద్ధాలపై ఆధారపడతారు.

వాస్తవాలు కొట్టొచ్చినట్లుగా వున్నాయి. వాస్తవాలే మంచి సాక్ష్యాలు. వాస్తవాలేమిటో పరిశీలిద్దాం.

# సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసుతో విభేదాలు ప్రారంభమయ్యాయి

"నదిలోని నీరు మూడడుగుల లోతు గడ్డకట్టాలంటే ఒక్కరోజు చాలదు" అన్న సామెతొకటుంది. అలాగే, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రస్తుతమున్న విభేదాలు ఈనాడే మొలకెత్తినవి కావు.

1960 ఏప్రిల్ మాసంలో మేము 'లెనినిజం చిరస్థాయి అగుగాక'

అనే వ్యాసాన్ని, మరో రెండు వ్యాసాలనూ ప్రచురించడంతో ఈ విభేదాలు ప్రారంభమైనాయనే అభిప్రాయాన్ని సోవియట్ పార్టీ బహిరంగ లేఖ ప్రచారం చేస్తున్నది. ఇది పెద్ద అబద్ధం. మరి వాస్తవం ఏమిటి?

వాస్తవ మేమిటంటే, అనేక సిద్ధాంత సమస్యలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఏడేండ్లక్రితమే విభేదాలు ప్రారంభమయ్యాయి. ఖచ్చితంగా చెప్పాల్సొస్తే సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసుతో ఈ విభేదాలు ప్రారంభమైనాయి.

సోవియట్ పార్టీ నాయకత్వం తమ రివిజనిస్టు మార్గంపై వేసిన మొదటి అడుగు 20వ పార్టీ కాంగ్రెసు. ఆనాటి నుండి యీనాటికి సోవియట్ పార్టీ నాయకత్వం యొక్క రివిజనిజం మొలకెత్తి, ఆకులువేసి, పెరిగి మహావృక్షమైంది. అలాగే ఒక క్రమంలో ప్రజలు కూడా సో క. పార్టీ నాయకుల రివిజనిస్టు పంథాను నానాటికీ మరింత లోతుగా అర్థం చేసుకోగలిగారు.

వర్తమాన అంతర్జాతీయ పోరాటం గురించీ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం గురించీ సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసు వెలిబుచ్చిన అనేక అభిప్రాయాలు తప్పులనీ, మార్క్సిజం - లెనినిజంను ఉల్లంఘించాయనీ మేము మొదటనుండీ భావిస్తున్నాము. ప్రత్యేకించి 'వ్యక్తిపూజా విరోధం' పేరుతో స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించడం, 'పార్లమెంటరీ మార్గంద్వారా' సోషలిజానికి శాంతియుతంగా పరివర్తన చెందుతుందనడం, ఘోరమైన సిద్ధాంత తప్పిదాలని మేము ఆది నుండే తలంచుతూ ఉన్నాము.

20వ కాంగ్రెసులో స్టాలిన్‌పై చేసిన విమర్శ సిద్ధాంతరీత్యానూ, పద్ధతి రీత్యానూ తప్పే.

స్టాలిన్ గొప్ప మార్క్సిస్టు-లెనినిస్టు; గొప్ప కార్మికవర్గ విప్లవ

2)

కారుడు. లెనిన్ మరణానంతరం, ముప్పయి సంవత్సరాలు సోవియట్ పార్టీకి, సోవియట్ ప్రభుత్వానికి సాటిలేని నాయకుడు స్టాలిన్. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంచే తన నాయకుడుగా గుర్తించబడిన వ్యక్తి స్టాలిన్. ప్రపంచ విప్లవ పతాకను మోసినవాడు స్టాలిన్. స్టాలిన్ తన జీవిత కాలంలో కొన్ని తీవ్రమైన తప్పులు చేశాడు. కాని ఆయనచేసిన ఘనమైన సేవతో పోల్చినపుడు అవి అప్రధానం

సోవియట్ యూనియన్ అభివృద్ధికీ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ పురోగతికి ఆయన గొప్ప కృషి చేశాడు. 1956 ఏప్రిల్‌లో ప్రచురింపబడిన 'కార్మికవర్గ నియంతృత్వపు చారిత్రకానుభవాల'న్న వ్యాసంలో మేము యిలా చెప్పాము :

"లెనిన్ మరణానంతరం పార్టీకీ, ప్రభుత్వానికీ ప్రధాన నాయకుడుగా వుంటూ మార్క్సిజం - లెనినిజంను సృజనాత్మకంగా అన్వయించి, అభివృద్ధిపర్చాడు స్టాలిన్. ప్రజల ఆశయాలనూ, ఆశలనూ ప్రతిధ్వనించాడు. లెనినిజాన్ని దాని శత్రువులయిన ట్రాస్కీయిస్టులు, జినోవీవైట్స్ తదితర బూర్జువా వర్గ ఏజంట్ల నుండి రక్షించడం కోసం జరిపిన పోరాటంలో తిరుగులేని మార్క్సిస్టు - లెనినిస్టు పోరాట యోధుడుగా గణుతి కెక్కాడు స్టాలిన్. సోవియట్ యూనియన్‌ను పారిశ్రామికవంతం చేయడం, వ్యవసాయాన్ని సమిష్టిపరం చేయడంలో లెనిన్ పంథాను సమర్థించడంలో స్టాలిన్, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ యితర నాయకులతోబాటు ముందున్నాడు. అందువల్లనే ఆయన సోవియట్ ప్రజల మద్దతును పొందగల్గాడు. చరిత్రలో ప్రముఖపాత్ర వహించగల్గాడుకూడా. ఈ విధానాన్ని అనుసరించడం వల్లనే, సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయం పొందడం సాధ్యమైంది. తద్వారా హిట్లర్‌కు వ్యతిరేకంగా జరిపిన యుద్ధంలో

సోవియట్ యూనియన్ విజయం సాధించడానికి కావలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. సోవియట్ యూనియన్ సాధించిన యీ విజయాలు ప్రపంచ కార్మికవర్గ ప్రయోజనాలకూ, అభివృద్ధి కాముక ప్రజానీకపు ప్రయోజనాలకూ అనుగుణమైనవి. అందువల్ల, ప్రపంచమంతటా స్టాలిన్‌ను గౌరవించడం సహజం."

స్టాలిన్ తప్పులను విమర్శించడం అవసరమే. కాని సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెసుకు సమర్పించిన రహస్య నివేదికలో కామ్రేడ్ కృశ్చేవ్, స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించాడు. తద్వారా కార్మికవర్గ నియంతృత్వాన్ని, సోషలిస్టు వ్యవస్థనూ, సోవియట్ యూనియన్‌నూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని అప్రతిష్టపాలు చేశాడు. కార్మికవర్గ నియంతృత్వ చారిత్రకానుభవాన్ని చిత్తశుద్ధితోనూ, లోతుగానూ విశ్లేషించి, సమీక్షించడంలో కార్మికవర్గ విప్లవపార్టీ అనుసరించవలసిన విమర్శ, ఆత్మ విమర్శనా విధానాన్ని ఉపయోగించడానికి బదులు, స్టాలిన్‌ను శత్రువుగా పరిగణించి, తప్పులన్నిటికీ ఆయన ఒక్కడే కారణమని చిత్రించాడు.

తన రహస్య నివేదికలో కుత్సిత బుద్ధితో వాక్చాతుర్యంతో అనేక అబద్ధాలు వల్లించాడు కృశ్చేవ్. స్టాలిన్‌కు "ఇతరులను వేధించి ఆనందించే పిచ్చి" పట్టిందనీ, "క్రూరమైన నిరంకుశుడనీ" మూకుమ్మడిగా "నిర్బంధ విధానాన్నీ, భీభత్సాన్నీ" ప్రయోగించాడనీ, "దేశమంటేనూ, వ్యవసాయమంటేనూ ఏమిటో కేవలం సినిమాలు చూచి నేర్చుకున్నా"డనీ, "గ్లోబ్ ముందు పెట్టుకొని యుద్ధతంత్రం వేశేవా"డనీ, సోవియట్ సామాజికాభివృద్ధి పథంలో స్టాలిన్ నాయకత్వం తీవ్రమైన అవరోధమైం" దనీ ఇంకా అనేకం రహస్య నివేదికలో చెప్పాడు. ఇంటా బయటా వున్న శత్రువులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలోనూ, సోషలిస్టు పరివర్తన– నిర్మాణములలో లభించిన గొప్ప విజయాలు సాధించడంలోనూ సోవియట్ ప్రజలకు

నాయకత్వం వహించిన స్టాలిన్ ఘన కార్యాలను తుడిచిపారవేశాడు కృశ్చేవ్. ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యాన్ని సంరక్షించడం లోనూ, బలవత్తర మొనర్చడంలోనూ, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో మహత్తర విజయాలను సాధించడంలోనూ సోవియట్ ప్రజలను నడిపిన స్టాలిన్‌ను, మార్క్సిజం - లెనినిజంను పరిరక్షించి, అభివృద్ధి పర్చిన స్టాలిన్‌ను పూర్తిగా తుడిచిపారవేశాడు కృశ్చేవ్.

సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసులో స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించడంతో కృశ్చేవ్, ఆచరణలో కార్మికవర్గ నియంతృత్వాన్నే కాల దన్నాడు. స్టాలిన్ పరిరక్షించి, అభివృద్ధిపరచిన మార్క్సిజం లెనినిజం ప్రధాన సిద్ధాంతాలనే కాలదన్నాడు కృశ్చేవ్. సరిగ్గా యీ మహాసభలోనే, అనేక సిద్ధాంత సమస్యలపై మార్క్సిజం-లెనినిజంను నిరాకరించడం ప్రారంభించాడు కృశ్చేవ్ తన నివేదికలో.

ప్రపంచ పరిస్థితిలో "తీవ్రమైన పరిణామాలు" జరిగాయనే సాకు చెప్పి "శాంతియుత పరివర్తన" సూత్రీకరణలు ప్రతిపాదించాడు కృశ్చేవ్. ఇదీ 20వ కాంగ్రెసులోనే. "అప్పటికున్న చారిత్రక పరిస్థితుల్లో అక్టోబరు విప్లవం తీసుకున్న మార్గమొక్కటే అప్పుడు సరైనది" అని చెపుతూ, ఇప్పటి పరిస్థితులు మారిపోయినందున "పార్లమెంటరీ మార్గంద్వారా" పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిస్టు పరివర్తన సాధ్యమయ్యే అవకాశం వచ్చిందని చెప్పాడు. ఇది రాజ్యాంగ యంత్రం - విప్లవం గురించిన మార్క్సిస్టు-లెనినిస్టు ప్రబోధాలను ఖచ్చితంగా తిరగదోడ్డమే. అక్టోబరు విప్లవ పంథాకుగల విశ్వవ్యాపిత ప్రాముఖ్యతను స్పష్టంగా నిరాక రించడమే.

ప్రపంచ పరిస్థితులలో "తీవ్రమైన పరిణామాలు" జరిగాయనే సాకు చెప్పి, సామ్రాజ్యవాదం, యుద్ధమూ, శాంతి సమస్యలపై లెనిన్ బోధన లను శంకించాడు కృశ్చేవ్. వాస్తవానికి లెనిన్ ప్రబోధాలనే కాల దన్నాడు.

అమెరికన్ ప్రభుత్వమూ, దాని నాయకుడూ యుద్ధ శక్తులను ప్రతి ఘటిస్తున్నట్లుగాను, వారు సామ్రాజ్యవాద యుద్ధశక్తుల ప్రతినిధులు కారన్నట్లుగానూ చిత్రించాడు కృశ్చేవ్. ఆయన ఇంకా యిలా అన్నారు "ప్రపంచ సమస్యలను యుద్ధంద్వారా పరిష్కరించాలని వాదించేవారు అమెరికాలో యింకా బలమైన స్థానాన్ని కలిగి వున్నారు... అమెరికా అధ్యక్షునిమీదా, ప్రభుత్వంమీదా పెద్ద ఒత్తిడి తీసుకొస్తున్నారు. బలంచూపి బెదిరించే విధానం విఫలమైనట్లు సామ్రాజ్యవాదులు అంగీకరించ నారంభించారని కూడా ఆయన చెప్పారు" వారిలో "ప్రశాంతంగా ఆలోచించే లక్షణాలు పొడసూపు తున్నాయ"ని కూడా ఆయన అన్నారు. అమెరికన్ ప్రభుత్వమూ, అధ్యక్షుడూ అమెరికన్ గుత్తపెట్టుబడిదార్ల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించడంలేదనీ, అందువల్ల యుద్ధమూ, దురాక్రమణ విధానాలను వారు విడనాడుతున్నారనీ, వారు శాంతి రక్షకశక్తులుగా తయారయినారనీ చెప్పడమే దీనిఅర్ధం.

కృశ్చేవ్ ఇలా చెప్పారు: "అమెరికాతో స్నేహితులుగా వుండాలని మా వాంఛ. ప్రపంచ శాంతి, భద్రతలకు గాను వారితో సహకరించాలని మా అభిలాష. ఆర్ధిక సాంస్కృతికరంగాల్లో కూడా సహకరించాలని మా అభిప్రాయం. ఈ తప్పుడు వైఖరే ఆ తర్వాత ప్రపంచ సమస్యల పరిష్కారానికి అమెరికా- సోవియట్ సహకారం" అనే పంథాగా రూపు దాల్చింది.

భిన్న సామాజిక వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవన మనేది లెనిన్ సూత్రీకరణ. అయితే యీ సూత్రీకరణను వికృత మొనర్చి, శాంతియుత సహజీవన విధానం"సోవియట్ యూనియన్ సాధారణ వైదేశిక విధానం" అని చెప్పాడు కృశ్చేవ్. దీని అర్ధం వివిధ సోషలిస్టు దేశాలమధ్య పరస్పర సహకారం అన్న సూత్రాన్నీ, పీడిత జాతుల, పీడిత దేశాల ప్రజలకు సోషలిస్టు దేశాలు సహాయం చేయడం అన్న

సూత్రాన్ని సోషలిస్టు దేశాల విదేశాంగ విధాన సాధారణ పంథానుండి మినహాయించడమే. "శాంతియుత సహజీవనం" విధానానికి పీటవిన్నింటిని లోబడివుండేటట్లు చేయడమే.

20వ పార్టీ కాంగ్రెసులో సోవియట్ పార్టీ నాయకత్వం లేవనెత్తిన సమస్యలు, ముఖ్యంగా స్టాలిన్ సమస్య, "శాంతియుత పరివర్తన" అనేవి కేవలం సోవియట్ పార్టీ అంతరంగిక వ్యవహారాలేమీ కాదు. అన్ని పార్టీలకూ అత్యంత ఉమ్మడి ప్రాధాన్యంగల సమస్య లివి. సోదర పార్టీలతో ముందుగా ఎట్టి సంప్రదింపులూ లేకుండా, సోవియట్ నాయకత్వం తనకు తాను ఏక పక్షంగా ఈ నిర్ణయాలు తీసుకొంది. తమకు కావలసింది ముందుగానే చేసిపారేసి, జరిగిపోయిన నిర్ణయంగా, మిగతా పార్టీలపై రుద్దడానికి ప్రయత్నించింది. "వ్యక్తి పూజా నిరోధం" పేరుతో సోదరపార్టీల, సోదర దేశాల వ్యవహారాలలో మొరటుగా జోక్యం చేసుకున్నది. వాటి నాయకత్వాలను కూల గొట్టడానికి ప్రయత్నించింది. ఆ విధంగా, తమ ఒంటెత్తువాద విధానాన్ని, చీలదీపే విధానాన్ని ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రవేశపెట్టింది.

ఈ తప్పిదాలు చేయడంతో, సోవియట్ నాయకత్వం మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయతలకు ద్రోహంచేసి, తిరగదోడే విధానాలను చేబట్టిందని తర్వాత చరిత్ర అంతకంతకూ స్పష్టంగా తెలియజేస్తున్నది.

20వ కాంగ్రెసు పట్ల చైనాపార్టీ వైఖరి ఎల్లప్పుడూ సోవియట్ వైఖరితో సిద్ధాంత రీత్యా విభేదిస్తూనే వుంది. ఈ విషయం సోవియట్ పార్టీ నాయకులకు స్పష్టంగా తెలుసు. అయివుండికూడా 20వ కాంగ్రెసుకు చైనా కమ్యూనిస్టుపార్టీ లోగడ పూర్తి ఆమోదం తెల్పి, ఇప్పుడు పూర్తి విరుద్ధ వైఖరి తీసుకున్నామని సోవియట్ పార్టీ బహిరంగ లేఖలో వ్రాసుకున్నారు. మా వైఖరి "వూగిసలాటలతో-చంచలమైనదిగా" వున్నదనీ అది "తప్పు" అనీ ఆరోపిస్తున్నారు.

సో.క.పా. నాయకులు తమ అరచేతిని అడ్డుపెట్టి ఆకాశాన్ని మూసి వేయలేరు. అలాగే సత్యాన్ని మూసిపెట్టడం సోవియట్‌పార్టీ నాయకత్వానికి అసాధ్యమే. వాస్తవాలు పరిశీలిద్దాం. సోవియట్‌పార్టీ 20వ కాంగ్రెసు అనంతరం జరిగిన ఆంతరంగిక చర్చలలో చైనా పార్టీ కేంద్ర కమిటీ ముఖ్యులు సోవియట్‌పార్టీ నాయకత్వం చేసిన తప్పులను విమర్శించారు.

20వ కాంగ్రెసు జరిగి రెండు నెల్లయినా కాక పూర్వమే 1956 ఏప్రిల్‌లో సో.క.పా. పొలిట్ బ్యూరో సభ్యుడు కామ్రేడ్ మికోయాన్‌తోనూ, చైనాలో సోవియట్ రాయబారితోనూ కామ్రేడ్ మావో-సే-టుంగ్ జరిపిన సంభాషణలలో స్టాలిన్ సమస్యపై మా వైఖరిని వివరించారు. స్టాలిన్ చేసిన గురుతరమైన సేవలముందు ఆయన చేసిన తప్పులు అల్పమైనవి అని ఆయన వ్యాఖ్యానించారు. స్టాలిన్‌ను గురించి "నిర్దిష్టమైన పరిశీలన చేయాల"ని "సమగ్రమైన అంచనా వేయాల"నీ మావో-సే-టుంగ్ వివరించారు.

1956 అక్టోబరు 23 వ తేదీన చైనాలో సోవియట్ రాయబారిని ఆహ్వానిస్తూ కామ్రేడ్ మావో-సే-టుంగ్ యిలా అన్నారు :—"స్టాలిన్‌ను విమర్శించవలసిందే. ఐతే మీ విమర్శనా పద్ధతితో మేము ఏకీభవించడంలేదు. ఇలాగే మరికొన్ని యితర విషయాలపై కూడా మేము ఏకీభవించడంలేదు."

1956 నవంబరు 30 న సోవియట రాయబారితో మాట్లాడుతూ కామ్రేడ్ మావో-సే-టుంగ్ మళ్ళీ యిలా చెప్పారు :— "స్టాలిన్ అధికారంలో వున్న కాలంలో అనుసరించిన మౌలిక విధానమూ, పంథా సరియైనవే. శత్రువుపై వినియోగించవలసిన పద్ధతులను కామ్రేడ్స్‌పై వినియోగించడం సరైనదికాదు."

1956 అక్టోబర్‌లో సోవియట్‌పార్టీ నాయకులతో కామ్రేడ్

లీషావ్-చీ జరిపిన సంభాషణల్లోనూ, చైనాపార్టీ 8 వ మహాసభకు హాజరైన సోవియట్ ప్రతినిధివర్గంతో కామ్రేడ్ చౌ-ఎన్-లై 1956 అక్టోబరు 1 న జరిపిన సంభాషణల్లోనూ, 1957 జనవరి 18న సోవియట్‌పార్టీ నాయకులతో కామ్రేడ్ చౌ-ఎన్-లై జరిపిన సంభాషణల్లోనూ స్టాలిన్ సమస్యపై మా అభిప్రాయాలను తెలియ జేశారు. "సమగ్రమైన పరిశీలన పూర్తిగా లోపించింద"నీ, "ఆత్మ విమర్శ లోపించింద"నీ, "ముందుగా సోదరపార్టీలతో సంప్రదించ డంలో విఫలమైంద"నీ కామ్రేడ్ లీషావ్ చీ, చౌ-ఎన్-లైలు యిరువురూ సోవియట్ పార్టీ నాయకుల తప్పులను విమర్శిం చారు.

శాంతియుత పరివర్తన సమస్యపై మేము ఎక్కడెక్కడ భేదిస్తున్నామో సోవియట్‌పార్టీ నాయకులతో జరిపిన సంభాషణల్లో చైనాపార్టీ కేంద్రకమిటీ ముఖ్యులు తెలియజేశారు. ఇంతేగాదు; చైనాపార్టీ వైఖరిని స్పష్టంగా వివరిస్తూ "శాంతియుత పరివర్తన సమస్యపై మా స్థూలమైన వైఖరి" అని వ్రాతపూర్వకంగాకూడా తెలియజేశాం. దీనిని చైనాపార్టీ కేంద్రకమిటీ, సోవియట్‌పార్టీ కేంద్రకమిటీకి 1957 నవంబరులో అందజేసింది.

20 వ పార్టీ కాంగ్రెసు చేసిన తప్పిదాలను స్పష్టంగా పేర్కొంటూ, అంతర్జాతీయ పరిస్థితిని గురించీ, ప్రపంచ కమ్యూ నిస్టు ఉద్యమవ్యూహం గురించీ మా అభిప్రాయాలను సోవియట్ పార్టీ కేంద్రకమిటీ ముఖ్యులతో, చైనాపార్టీ కేంద్రకమిటీ ముఖ్యులు జరిపిన అనేక సంభాషణల్లో తెలియజేశారు.

ఇవన్నీ తిరుగులేని సాక్ష్యాలు, వాస్తవాలు. సిగ్గువిడిచి అబద్ధాలు వల్లించడంతో, వీటిని కొట్టిపారవేయాలని సోవియట్‌పార్టీ నాయకత్వం ప్రయత్నిస్తున్నది.

ఈ ముఖ్యవిషయాలను మరుగుపర్చాలని ప్రయత్నిస్తూ, కామ్రేడ్స్ మావో-సే-టుంగ్, లీషావ్-చీ, టెంగ్‌సియావో-పింగ్ చేసిన బహిరంగ ప్రకటనలను అసందర్భంగా తమ బహిరంగ లేఖలో వుల్లేఖించారు. చైనా ఒకప్పుడు 20 వ కాంగ్రెసును పూర్తిగా సమర్థించిందని చెప్పుకోడానికి తంటాలుపడుతున్నారు. ఇది వృధాప్రయాస.

సోవియట్‌పార్టీ 20 వ కాంగ్రెసును చైనా కమ్యూనిస్టుపార్టీ ఎన్నడూ ఎక్కడా పూర్తిగా ధృవపర్చలేదు. స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించడాన్నిగాని, "పార్లమెంటరీమార్గం" ద్వారా సోషలిజానికి శాంతి యుత పరివర్తన అనే అభిప్రాయాన్నిగాని మేమెన్నడూ అంగీకరించనూ లేదు, బలపర్చనూలేదు.

20 వ కాంగ్రెసు జరిగిన అనతికాలంలోనే, 1956 ఏప్రిల్ 5 వ తేదీన "కార్మికవర్గ నియంతృత్వ చారిత్రకానుభవం" అనే వ్యాసాన్ని, అదే సంవత్సరం డిసెంబరు 29 న "కార్మికవర్గ నియంతృత్వ చారిత్ర కానుభవంపై కొంత వివరణ" అనే మరో వ్యాసాన్ని మేము ప్రచు రించాము.

(ఈ వ్యాసాన్ని భారతదేశంలోని సోవియట్ సమాచారశాఖ కూడ తెలుగులో ప్రచురించింది. — ప్రచురణకర్తలు.)

ఈ వ్యాసాల్లో సామ్రాజ్యవాదులూ, అభివృద్ధినిరోధకులూ చేస్తున్న కమ్యూనిస్టు వ్యతిరేక దుష్ప్రచారాన్ని ఖండించాము. స్టాలిన్ జీవితం గురించిన సర్వతోముఖమైన పరిశీలన చేశాము. అక్టోబరు విప్లవపంథాకు గల విశ్వవ్యాప్త ప్రాధాన్యతను నొక్కి చెప్పాము. కార్మికవర్గ నియం తృత్వం గురించిన చారిత్రకానుభవాన్ని క్రోడీకరించాము. 20వ కాంగ్రెసు వెలిబుచ్చిన తప్పుడు సూత్రీకరణలను చాకచక్యంగానూ, నిర్ద్వంద్వం గానూ విమర్శించాము. ఇది అందరెరిగున్న వాస్తవమే.

3)

20 వ కాంగ్రెసు జరిగిన తర్వాత కూడా విప్లవ మహానాయకులైన మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ చిత్తరువులతోబాటు స్టాలిన్ చిత్రపటాన్ని కూడా ప్రదర్శించుతూనే ఉన్నాము. ఇది కూడా అందరెరిగున్న వాస్తవమే.

ఐతే యిక్కడొక విషయం చెప్పితీరాలి. శతృవుకు వ్యతిరేకంగా ఐక్యతకొరకూ, సోవియట్ నాయకులకున్న యిబ్బంది పరిస్థితిదృష్ట్యానూ, 20వ కాంగ్రెసు చేసిన తప్పుడు సూత్రీకరణలను బహిరంగంగా ఖండించకుండా వూరుకున్నాము. ఈ తప్పులను ఆసరాగా చూచుకొని సామ్రాజ్యవాదులూ, అభివృద్ధి విరోధకులూ సోవియట్ యూనియన్‌పైనా, కమ్యూనిజానికి-ప్రజలకు వ్యతిరేకంగానూ ఉన్మాదపూరితమైన కార్యకలాపాలు సాగిస్తున్నారు. అప్పటికింకా, సోవియట్ నాయకులు మార్క్సిజం-లెనినిజం నుండి ఆ తర్వాత వెళ్ళినంత దూరంగా వెళ్ళిపోలేదు. వీటన్నిటివల్ల మేము బహిరంగ విమర్శనకు దిగలేదు." సోవియట్ నాయకులు తమ తప్పులను సరిదిద్దుకుంటారని గాఢంగా వాంఛించాము. అందువల్లనే మేము ఎల్లప్పుడూ ఏకీభావమున్న అంశాలనే చూస్తూ వచ్చాము. బహిరంగ సందర్భాలొచ్చినప్పుడు తగినంత, అవుసరమైనంత సహకారాన్ని ఇస్తూ వచ్చాము.

ఏకీ భావమున్న గుణపాఠాలను, సూత్రీకరణలను మాత్రమే బహిరంగోపన్యాసాలలో నొక్కి చెపుతూ, మా కేంద్ర కమిటీ ముఖ్యులు సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ ముఖ్యులతో జరిపిన సంభాషణల్లో 20 వ పార్టీ కాంగ్రెసుపై మా వైఖరిని వివరిస్తూ వచ్చారు.

చైనా పార్టీ 8వ మహాసభ కిచ్చిన నివేదికలో కామ్రేడ్ లీ-షావ్2 చీ 20వ కాంగ్రెసును పూర్తిగా ధృవపరచారని సోవియట్‌పార్టీ బహిరంగ లేఖ చెపుతున్నది. కాని అదే నివేదికలో కామ్రేడ్ లీషావ్-చీ చైనా విప్లవ గుణపాఠాలను వివరిస్తూ "శాంతియుత పరివర్తన" మార్గం తప్పనీ, ఆచరణయోగ్యం కాదనీ చెప్పారు.

చైనాపార్టీ 8 వ మహాసభకు, పార్టీ నింబధనావళి మార్పు గురించి కామ్రేడ్ టెంగ్ సియావో-పింగ్, యిచ్చిన నివేదికలో 20 వ కాంగ్రెసు జరిపిన "వ్యక్తిపూజా నిరోధకం" అనే పోరాటాన్ని పూర్తిగా ధృవీక రించారని సోవియట్ లేఖ చెప్పుతుంది. కామ్రేడ్ టెంగ్ సియావో పింగ్, పార్టీలో కేంద్రీకృత ప్రజాసామ్యంపైన నాయకులకూ, ప్రజలకూ మధ్య గల పరస్పర సంబంధాలపైనా సుదీర్ఘంగా చర్చించారు. మా పార్టీ అవలం బిస్తూ వుండిన సరైన, నికరమైన పని తీరును వివరించారు. ఆ విధంగా, "వ్యక్తి పూజా నిరోధం" అనే పేరిట 20 వ పార్టీ కాంగ్రెసు చేసిన తప్పి దాన్ని విమర్శించారు.

మేము అనుసరించిన పద్ధతిలో ఏమైనా పొరబాటు వున్నదా? సూత్రాలకు కట్టుబడి వుంటూ, ఐక్యతను రక్షించడమనేది ఏ మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ అయినా చేయవలసింది. దీన్నే మేము అనుస రించాము.

20వ కాంగ్రెసు పట్ల నికరమైన, సరైన ఈ మా వైఖరిని ఊగిస లాటగానూ, చంచల మైనదిగానూ, "తప్పుగానూ" "180 డిగ్రీల పిరా యింపుగానూ" చిత్రించ బూనటం ఎలా సాధ్యం?

మేము చేసిన విమర్శలు కొద్దిమంది సోవియట్ నాయకులకు మాత్రమే తెలుసు. అందువల్ల మాపైన యీ ఆరోపణలు బహిరంగ లేఖలో చేయడం ద్వారా, మా విమర్శనలను నిరాకరించ వచ్చునని సోవి యట్ పార్టీ కేంద్రకమిటీ బహుశా భావించి వుండవచ్చు. అబద్ధాలు చెప్పి సోవియట్ పార్టీ సభ్యులనూ, సోవియట్ ప్రజలనూ మోసం చెయ్యగల మని సోవియట్ కేంద్రకమిటీ ఆశించి వుండవచ్చు. కాని, యీ పని చేయడం ద్వారా తమ తప్పుడు విధానాన్ని తానుగానే నిరూపించు కొంటున్నది.

# సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెసు దుష్పరిణామాలు

సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెసు సాధించిన అద్భుతమైన, "బ్రహ్మాండమైన ఫలితాల"ను సోవియట్ కేంద్ర కమిటీ బహిరంగలేఖ పెద్ద స్వరంతో ప్రచారం చేస్తున్నది.

ఏమైనా, చరిత్రను తారుమారు చేయడం సాధ్యంకాదు. అనేక తప్పుల ద్వారా 20 వ కాంగ్రెసు తెచ్చింది "అద్భుతమైన, బ్రహ్మాండమైన ఫలితాలు" కాదు. సోవియట్ యూనియన్‌కు, కార్మికవర్గ నియంతృత్వానికి. సోషలిజం, కమ్యూనిజంలకు అది తెచ్చింది అప్రతిష్ఠ మాత్రమేనని ఏ కొంచెం జ్ఞాపకశక్తి వున్నవాడికైనా గుర్తుండే వుంటుంది; సామ్రాజ్య వాదులకు, అభివృద్ధి నిరోధకులకూ, కమ్యూనిస్టు వ్యతిరేకులకూ అది అవకాశాలు కల్పించిందనీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి దుష్పరిణామాలు తెచ్చి పెట్టిందనీ, ఏ కొంచెం జ్ఞాపకశక్తి వున్నవారికైనా గుర్తుండే వుంటుంది.

20వ కాంగ్రెస్ తదనంతరం అహంభావ పూరితులైన సామ్రాజ్య వాదులు, అభివృద్ధి నిరోధకులు సోవియట్ యూనియన్‌కూ కమ్యూనిజానికీ, ప్రజలకూ వ్యతిరేకంగా ప్రపంచవ్యాపిత దుమారాన్ని లేవగొట్టారు. స్టాలిన్ పైన సోవియట్ నాయకత్వం చేసినదాడి, "మన ప్రయోజనాలకు తోడ్పడే అపూర్వ ఘటన" అంటూ అమెరికా సామ్రాజ్యవాదులు వర్ణించారు. "కమ్యూనిస్టు ఉద్యమ ప్రతిష్టనూ వలుకుబడినీ దెబ్బతీయటానికి ఆయుధం"గా కృశ్చేవ్ రహస్య రిపోర్టును వినియోగించుకోవాలని వారు బహిరంగంగానే మాట్లాడారు. ఈ అవకాశాన్ని తీసుకొని సోవియట్

యూనియన్‌లోనే "శాంతియుత పరిణామం" వస్తుందని ప్రచారం ప్రారంభించారు.

టిటో ముఠా చాల విచ్చలవిడిగా ప్రవర్తించడం మొదలెట్టింది. "స్టాలిన్ వ్యతిరేకత అన్న తమ అభివృద్ధి నిరోధక నినాదంతో విర్రవీగుతూ కార్మికవర్గ నియంతృత్వాన్నీ సోషలిస్టు వ్యవస్థనూ దారుణంగా నిందించారు. యుగోస్లావియా ప్రారంభించిన "నూతన పంథా" కనుకూలమైన "శక్తులను తగిన మోతాదులో" సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసు సృష్టించిందని వారు ప్రకటించారు. "ఇప్పుడు తేలవలసిన ప్రశ్నల్లా ఈ పంథా జయించుతుందా, లేక స్టాలినిజమే తిరిగి జయించుతుందా అనేదే" నని వా రన్నారు. (1956 నవంబరు 11 న ప్యూలాలో టిటో ప్రసంగం)

అంతవరకూ దిక్కుతోచని స్థితిలో పడివున్న కమ్యూనిజానికి శత్రువులైన ట్రాట్స్కీవాదులు తమ కార్యకలాపాలను ఉధృతం చేశారు. "ప్రపంచ కార్మికులకు-ప్రజలకు ప్రణాళిక" అన్న గ్రంథంలో నాల్గవ ఇంటర్నేషనల్ అని చెప్పుకొంటున్న వీరి సంస్థ ఇలా అన్నది:— "స్టాలిన్ చేసిన నేరాలు నేడు క్రెమ్లిన్ నాయకులే అంగీకరిస్తున్నారు. కార్మిక ప్రభుత్వం దిగజారిపోయిందంటూ ప్రపంచ ట్రాట్స్కీయైట్ ఉద్యమం సాగించిన నిర్విరామ పోరాటం పూర్తిగా న్యాయమైందేనని వారు అంగీకరిస్తున్నారు అనే దీని అంతరార్థం."

సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసు చేసిన తప్పులు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో పెద్ద సిద్ధాంత గందరగోళాన్ని కలిగించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని రివిజనిస్టు భావాల ప్రవాహంలో పడవేసింది. సామ్రాజ్యవాదులు, అభివృద్ధి నిరోధకులు టిటోగ్రూపు, కమ్యూనిజానికి ద్రోహులైన వారంతా మార్క్సిజం-లెనినిజంపైనా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపైనా దాడివేశారు.

ఈ దశలో జరిగిన ఘటనల్లో అత్యంత ముఖ్యమైనవి, సోవియట్-పోలెండ్ల మధ్య జరిగిన ఘటన, హంగెరీలో విప్లవ ప్రతీఘాతక తిరుగుబాటు. ఈ రెండు ఘటనలూ వేర్వేరు స్వభావాలు గలవి. ఐనా రెంటిలోనూ సోవియట్ నాయకత్వం తీవ్రమైన తప్పిదాలు చేసింది. సాయుధ బలప్రయోగంద్వారా పోలెండ్ కామ్రేడ్స్‌ను లొంగ తీసుకోవాలన్న ఉద్దేశ్యంతో సైన్యాలను తరలించి అగ్రరాజ్య దురహంకార తప్పిదం చేసింది. హంగెరీ విప్లవ ప్రతీఘాత శక్తులు బుడాపెస్టు (రాజధాని నగరం-ప్రచురణ కర్తలు) నాక్రమించుకొన్న అతి క్లిష్ట సమయంలో సోవియట్ నాయకత్వం లొంగుబాటు ధోరణిని అనుసరించాలని, హంగరీని విప్లవ ప్రతీఘాతకులకు వదలివేయాలని కొంతకాలం భావించింది.

సోవియట్‌పార్టీ చేసిన ఈ తప్పిదాలు కమ్యూనిజానికి శత్రువులైన వారి అహంభావాన్ని విపరీతంగా పెంచాయి; అనేక సోదరపార్టీలకు చాల తీవ్రమైన ఇబ్బందుల్ని కలిగించాయి; అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి గొప్పనష్టాన్ని కలుగజేశాయి.

ఆ పరిస్థితుల్లో సామ్రాజ్యవాదుల, అభివృద్ధి నిరోధకుల దాడిని తిప్పికొట్టాలని చైనా కమ్యూనిస్టుపార్టీ, మార్క్సిజం-లెనినిజం కొరకై పట్టుదలతో పనిచేస్తున్న ఇతర సోదరపార్టీలు గట్టిగా డిమాండ్ చేశాయి; ఆ విధంగా సోషలిస్టు శిబిరాన్ని, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని పరిరక్షించుకోవాలని నొక్కి చెప్పాయి. హంగరీలో విప్లవ ప్రతీఘాతుక తిరుగుబాటును అణచటానికై అవసరమైన సకల చర్యలు తీసుకోవాలని మేము పట్టుబట్టాము; సోషలిస్టు హంగరీని శత్రువులకు వదలివేయడాన్ని గట్టిగా వ్యతిరేకించాము. సోదరపార్టీల మధ్య, సోదర దేశాలమధ్య ఉత్పన్నమయ్యే సమస్యలను పరిష్కరించుకొనడంలో సరయిన పద్ధతులు అవలంబించాలని మేము పట్టుబట్టాము: ఆ విధంగా సోషలిస్టు శిబిరం యొక్క ఐక్యతను పటిష్టవంతం చేయాలని మేము చెప్పాము. అగ్రరాజ్య

దురహంకారాన్ని మేము నిక్కచ్చిగా వ్యతిరేకించాము. అదే సమయంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్టను కాపాడటానికి మేము పెద్ద ప్రయత్నం చేశాము.

అప్పుడు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు మా సూచనను అంగీకరించారు. "సోవియట్ యూనియన్, ఇతర సోషలిస్టు దేశాలమధ్య స్నేహ సహకారాలను పటిష్టవంతం చేసే సూత్రాల ప్రకటన"ను 1956 అక్టోబరు 30న సోవియట్ ప్రభుత్వం విడుదల చేసింది సోదర దేశాలతో సంబంధాలు నెరపుకొనడంలో గతంలో తాము చేసిన పొరపాట్లను అందులో వారు పునః పరిశీలించుకొన్నారు. సోవియట్ ప్రభుత్వ ప్రకటనను బల పరుస్తూ నవంబరు 1న చైనా ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనం దృష్ట్యానూ, సరైన గుణపాఠాలు తీసుకొని, తప్పులను సకాలంలో సరిదిద్దుకొమ్మని, మార్క్సిజం-లెనినిజం నుండి మరింతగా దూరం కావద్దని సోవియట్ పార్టీ నాయకులకు నచ్చజెప్పే ఉద్దేశంతోనే ఇదంతా మేము చేశాము. కాని, ఆ తర్వాత జరిగిన సంఘటనలు తెలుపుతున్న దేమంటే సోవియట్ పార్టీ నాయకులు మాపైన పగను పెంచుకొన్నారు; కార్మికవర్గం అంతర్జాతీయత కొరకై పట్టుదలతో కృషి చేసే చైనా కమ్యూనిస్టుపార్టీ తమ తప్పుడు మార్గానికి అత్యంత పెద్ద ఆటంకంగా పరిగణించారు.

## 1957 లో మాస్కోలో సోదరపార్టీల సమావేశం

సామ్రాజ్యవాదులు, అనేక దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులూ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై పెద్దగా సాగించిన దాడులన్నీ త్రిప్పి

కొట్టబడ్డ తరువాత 1957లో ప్రపంచ కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీల ప్రతినిధుల సమావేశం మాస్కోలో జరిగింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం అనుసరించాల్సిన జనరల్ పంథాను నిర్వచించడంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెసు (మహాసభ) "బ్రహ్మాండమైన పాత్ర నిర్వహించిన"దని సోవియట్ పార్టీ కేంద్రకమిటీ బహిరంగలేఖ చెపుతోంది. కాని, జరిగిన వాస్తవాలు సరిగ్గా యిందుకు విరుద్ధంగా వున్నాయి. సిద్ధాంతానికి సంబంధించిన అనేక ముఖ్య సమస్యలపై 20వ పార్టీ కాంగ్రెస్ వెలిబుచ్చిన తప్పుడు అభిప్రాయాలను 1957లో జరిగిన ప్రపంచ పార్టీల సమావేశం తిరస్కరించడమేగాక, సవరించింది కూడా.

1957 మాస్కో సమావేశం ప్రఖ్యాత పత్రాన్నొకదాన్ని (డిక్లరేషన్) ఆమోదించి వుంది. ఆ పత్రం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానుభవాన్ని క్రోడీకరించింది; కమ్యూనిస్టు పార్టీలన్నీ కలిసి నిర్వహించాల్సిన పోరాటలక్ష్యాల్ని ముందుపెట్టింది; అక్టోబర్ మహావిప్లవ పంథా విశ్వజనీన ప్రాధాన్యతను నొక్కిచెప్పింది. సోషలిస్టు విప్లవాన్ని సోషలిస్టు నిర్మాణాన్ని అనుశాసించే సాధారణ సూత్రాలను పేర్కొన్నది. సోదరపార్టీలమధ్య, దేశాలమధ్య సంబంధాలను నిర్దేశించే సూత్రాలను రూపొందించింది. ఈ విధంగా 1957 సమావేశం రూపొందించిన అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సమష్టిపంథాలో మార్క్సిజం - లెనినిజం విప్లవ సూత్రాలు మూర్తీభవించాయి. మార్క్సిజం - లెనినిజం నుంచి దూరమైపోయి 20వ పార్టీ కాంగ్రెసు తీసుకున్న తప్పుడు అభిప్రాయాలకు, ఈ పంథా వ్యతిరేకం. 1957 పత్రంలో పేర్కొన్నట్లు సోదర పార్టీల, దేశాలమధ్య సంబంధాలను అనుశాసించే సూత్రాలు, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి నిర్దిష్టమైన ప్రతిబింబాలు. ఈ సూత్రాలు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ బడాదేశ దురంహంకారానికి, ఒంటెత్తు విధానానికి విరుద్ధం.

కామ్రేడ్ మావో సే టుంగ్ నాయకత్వాన వెళ్ళిన చైనాపార్టీ ప్రతినిధివర్గం ఆ సమావేశంలో గొప్ప కృషి చేసింది. ఒకవైపున ఈ ప్రతినిధివర్గం సోవియట్ పార్టీ నాయకులతో పూర్తి సంభాషణలు సాగించింది. సోవియట్ పార్టీ నాయకులు తమ తప్పిదాలను దిద్దుకొనేందుకుగాను అవసరమనుకొన్నప్పుడు తగిన సమయం అని భావించినప్పుడు చైనా ప్రతినిధివర్గం సోవియట్ నాయకుల తప్పిదాలను వ్యతిరేకించింది. మరో వైపున చైనాపార్టీ, అన్ని పార్టీలకూ ఆమోదయోగ్యమైన వుమ్మడి డాక్యుమెంటును రూపొందించేందుకు గాను ఇతర సోదరపార్టీల నాయకులతో పదేపదే సంభాషించి అభిప్రాయాలను ఇచ్చిపుచ్చుకొంది

1957 సమావేశంలో మాకూ, సోవియట్ పార్టీ ప్రతినిధి వర్గానికీ మధ్య వివాదంలో ప్రధాన అంశం; పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన అన్న అంశం. సమావేశపత్రమంటూ తయారు చేసిన తొలి ముసాయిదాలో శాంతియుత పరివర్తన గూర్చి 20 వ పార్టీ కాంగ్రెస్ తీసుకున్న తప్పు నిర్ణయాలను చేర్చాలని సోవియట్ పార్టీ నాయకత్వం పట్టుబట్టింది. ఈ తొలి ముసాయిదా, శాంతియుతేతర పరివర్తనావకాశాల్ని గూర్చి ఒక్క మాటకూడా చెప్పలేదు. ఎంతసేపటికీ శాంతియుత పరివర్తన గూర్చి మాత్రమే ప్రస్తావించింది. పైగా ఈ తొలి ముసాయిదా శాంతియుత పరివర్తన గూర్చి యిలా వర్ణించింది; 'పార్లమెంటులో మెజారిటీ సంపాదించటం, పార్లమెంటును బూర్జువా నియంతృత్వ సాధనంగా ఉన్న దశనుండి నిజమైన ప్రజా ప్రభుత్వాధికార సాధనంగా పరివర్తింపజేయడం' అంటే వాస్తవంలో ఈ తొలి ముసాయిదా అక్టోబర్ విప్లవ పంథాకు మారుగా సెకండ్ ఇంటర్నేషనల్ అవకాశవాదులు ప్రవచించిన 'పార్లమెంటరీ మార్గాన్ని' ప్రవేశ పెట్టింది. ఆ విధంగా అది రాజ్యాంగ

4)

యంత్రం - విప్లవ సమస్యలపై మార్క్సిస్టు - లెనినిస్టు మౌలిక సిద్ధాంతాన్ని నిర్వీర్య పర్చ ప్రయత్నించింది.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ప్రవేశ పెట్టిన ముసాయదా ప్రకటనలోని తప్పు అభిప్రాయాలను చైనా కమ్యూనిస్టు పార్టీ దృఢంగా వ్యతిరేకించింది. ఆ తరువాత సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ వరుసగా ప్రవేశ పెట్టిన రెండు ముసాయిదాల పైనా మా అభిప్రాయాలేమిటో వ్యక్తపర్చాం. సూత్ర బద్ధమైన అనేక ప్రధాన మార్పులు చేశాం. వాటిని మేము, మా ప్రతినిధివర్గం తరపున పునఃపరిశీలన జరిగిన ముసాయిదాగా ప్రవేశపెట్టాం. ఈ మా ముసాయిదా ఆధారంగా 'సోవియట్-చైనా పార్టీల సంయుక్త ముసాయిదా పత్రాన్ని' అభిప్రాయ సేకరణకై ఇతర సోదర పార్టీల ప్రతినిధి వర్గాలకు సమర్పించే ముందు చైనా సోవియట్ పార్టీల ప్రతినిధి వర్గాల మధ్య పదే పదే చర్చలు జరిగాయి.

చైనా కమ్యూనిస్టు పార్టీ, తదితర సోదర పార్టీల ప్రతినిధి వర్గాలు జరిపిన సమిష్టికృషి ఫలితంగా 1957 మాస్కో సమావేశం, తుదకు ఈనాడు మనముందున్న మాస్కో పత్రంగా ఆమోదించింది. సోవియట్ పార్టీ నాయకత్వం తయారుచేసిన తొలి ముసాయిదాతో పోల్చి చూచినట్లయితే, ఆఖరుకు ఆమోదించబడ్డ పత్రంలో పెట్టుబడి దారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన అన్న సమస్యపై రెండు ప్రధానమైన మార్పులు అవుపిస్తాయి.

1. ఈ తుదిపత్రం శాంతియుత పరివర్తనకు అవకాశం వున్నదని చెపుతూనే, సోషలిజం సాధనకు శాంతియుతేతర మార్గాన్ని కూడా ప్రస్తావించింది. 'పాలక వర్గాలు అధికారాన్ని ఇచ్ఛికంగా పరిత్యజించవని లెనినిజం బోధిస్తోంది. అనుభవమూ దీన్ని రుజువు చేస్తోం'దనీ ఆ పత్రం నొక్కి చెప్పింది.

2. అలాగే ఈ పత్రం 'పార్లమెంటులో నికరమైన మెజారిటీ సాధించ

డాన్నిగూర్చి చెప్తూనే, పార్లమెంటరీమేతర ప్రజా పోరాటాన్ని నడిపి అభివృద్ధి నిరోధకశక్తుల ప్రతిఘటనను తుత్తునియలు చేసి, సోషలిస్టు విప్లవ శాంతియుత విజయానికి అవసరమైన పరిస్థితులను సృష్టించుకోవా ల్సిన అవసరాన్నికూడా నొక్కి చెప్పింది.

ఈ మార్పులు ఆ పత్రంలో వున్నప్పటికీ, పెట్టుబడిదారీ వ్యవస్థనుండి సోషలిజానికి పరివర్తన అన్న సమస్యపై మాస్కో పత్రంలో చేసిన సూత్రీకరణమాత్రం అప్పటికి సంతృప్తి కలి గించలేదు. అయితే సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసు సూత్రీకరణ లతో కొంతయినా పొందిక వుండేటట్లు చూడమనీ సోవియట్ పార్టీ నాయకులు పదే పదే కోరినందున, పోనీలెమ్మని తుదకు ఆ పాయింట్ మీద మేము పట్టుబట్టకుండా వదిలేశాం.

ఏమైనప్పటికీ మేము, శాంతియుత పరివర్తనా సమస్యపై మా అభిప్రాయాలను స్థూలంగా సోవియట్ పార్టీ కేంద్ర కమిటీకి అందజేశాం. అందులో చైనాపార్టీ అభిప్రాయాలేమిటో సమగ్రంగా దాపరికం లేకుండా స్పష్టంగా పేర్కొనడం జరిగింది. ఆ స్థూలమైన ప్రకటనలో ఈ క్రింది విషయాలు తెల్పాం:

"అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రస్తుత పరిస్థితుల్లో, ఎత్తుగడల దృష్ట్యా శాంతియుత పరివర్తన కావాలన్న వాంఛను ప్రస్తావించడం లాభదాయకమే. కాని శాంతియుత పరివర్తనావకా శాన్ని గూర్చి అతిగా నొక్కి చెప్పడం అసమంజసంగా వుంటుంది"

"విప్లవ ప్రతీఘాతక దాడులను త్రిప్పికొట్టేందుకు శ్రామిక వర్గమూ, కమ్యూనిస్టుపార్టీ ఎల్లవేళలా సిద్ధంగా వుండాలి. అలాగే కార్మికవర్గం రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుంటున్న క్లిష్టమైన విప్లవదశలో బూర్జువావర్గం ప్రజా విప్లవాన్ని అణచివేయడానికి సాయుధశక్తిని వినియోగించినప్పుడు సాయుధశక్తితోనే ఆ

బూర్జువా వర్గాన్ని కూలద్రోసేందుకూ సాధారణంగా చెప్పాలంటే (బూర్జువావర్గం సాయుధదాడికి పూనుకుంటారనేది అనివార్యమైన విషయం.) శ్రామిక వర్గమూ కమ్యూనిస్టుపార్టీ అన్నివేళలా సిద్ధంగా వుండాలి." పార్లమెంటులో మెజారిటీ సాధించడమూ పాత రాజ్యాంగ యంత్రాన్ని ముఖ్యంగా సాయుధ బలంపై ఆధారపడ్డ రాజ్యాంగ యంత్రాన్ని కూలద్రోసి, దానిస్థానే నూతన రాజ్యాంగ యంత్రాన్ని నెలకొల్పడమూ ఒకటిగాదు. బూర్జువావర్గ సైనిక నిరంకుశాధికార రాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేయనిదే, శ్రామికవర్గానికీ వారిమిత్రులకూ పార్లమెంటులో మెజారిటీ సంపాదించడం అసాధ్యమైనా అవుతుంది; లేదా ఆధారపడదగనిదైనా అవుతుంది."

(అనుబంధం - 1 చూడుడు)

చైనా పార్టీ, తదితర సోదరపార్టీల ప్రతినిధివర్గాలు జరిపిన సమిష్టి కృషి ఫలితంగా 1957 పత్రం, సామ్రాజ్యవాదం-యుద్ధమూ-శాంతి వగైరా సమస్యలపై 20వ పార్టీ కాంగ్రెసులో సోవియట్ పార్టీ నాయకత్వం చొప్పించిన తప్పుడు అభిప్రాయాలను కూడా సవరించింది. అనేక సిద్ధాంత సమస్యలపై అనేక ముఖ్యమైన అంశాలను 1957 పత్రం చేర్చింది. ఇందులో ప్రధానమైన చేర్పులు:— అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తులకు ప్రధాన కేంద్రంగా వుంది. అది ప్రపంచ ప్రజలకు బద్ధ శత్రువు. సామ్రాజ్యవాదం ఈ సారి మూడో ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించి నట్లయితే అది తన వినాశాన్ని తానే కొని తెచ్చుకొన్నట్లవుతుంది. సోషలిస్టు విప్లవాన్ని, సోషలిజం నిర్మాణాన్ని అనుశాసించే సర్వసాధారణ సూత్రాలు, మార్క్సిజం-లెనినిజం విశ్వజనీన సత్యాన్ని వివిధ దేశాలలోని నిర్దుష్టమైన విప్లవ, నిర్మాణాచరణలతో జోడించడమనే సూత్రం. కార్యాచరణలో గతితార్కిక భౌతిక వాదాన్ని అనువర్తింప చేయడంలోగల

ప్రాధాన్యతకు సంబంధించిన సూత్రీకరణ, కార్మికవర్గం రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోవడం అనేది విప్లవ ప్రారంభదశ మాత్రమే గానీ దాని ముగింపు మాత్రం కాదు అన్న సిద్ధాంతీకరణ, పెట్టుబడిదారీ విధానమా, సోషలిజమా-ఏది విజయం సాధిస్తుంది అన్న సమస్య పరిష్కారం కావడానికి సుదీర్ఘ కాలమే పడ్తుందన్న సిద్ధాంతీకరణ, బూర్జువావర్గ ప్రభావం యొక్క ఉనికి రివిజనిజం ఆవిర్భవించడానికి దారితీసే ఆంతరంగిక మూలం కాగా సామ్రాజ్యవాద వత్తిడికి లొంగిపోవడమనేది రివిజనిజం ఆవిర్భవించడానికి దారితీసే బాహ్యకారణం అనీ సిద్ధాంతీకరణ. అలాగే మరికొన్ని. ఇవి-1957 పత్రం చేసిన ప్రధాన చేర్పులు.

ఇదే సందర్భంలో చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం అవసరమైన కొన్ని రాజీలకు ఒప్పుకుంది. శాంతియుత పరివర్తనా సమస్యకు సంబంధించిన సూత్రీకరణతోపాటు మేము, సోవియట్ పార్టీ 20వ కాంగ్రెసును గూర్చిన ప్రస్తావనకు అంగీకరించలేదు. ఆ సందర్భంలో మేము కొన్ని మార్పులు సూచించాం. కాని ఆ సమయంలో సోవియట్ పార్టీ నాయకత్వపు చిక్కు పరిస్థితిని దృష్టిలో పెట్టుకునే మేము, మార్పులపై పట్టుబట్టకుండా వదిలేశాం.

బహుళ ప్రయోజనాల దృష్ట్యా మేము చూపిన ఈ వెసులుబాట్లను (రాజీలను) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ఉత్తరోత్తరా విభేదాలను మరింత పెంచేందుకు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక తెచ్చేందుకూ ఒక సాకుగా ఉపయోగించు కొంటుందని యెవరు ఊహించగలరు?

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం రూపొందించుకొన్న ఉమ్మడి పంథా స్థానే 20వ పార్టీ కాంగ్రెసు తీసుకున్న తప్పుడు పంథాను చొప్పించే యత్నంలో సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ బహిరంగలేఖ 20వ పార్టీ కాంగ్రెసు తీర్మానాన్ని 1957 పత్రానికి (1957 డిక్లరేషన్)- ప్రత్యా

మ్యాయంగా చేయడానికి ప్రయత్నిస్తోంది. అన్ని సోదరపార్టీలు స్వతంత్ర మైనవి, సరిసమాన హోదా గలవన్న సూత్రం ప్రకారం ఏదో ఒక పార్టీ కాంగ్రెస్ చేసిన తీర్మానాలను ఇతర పార్టీలు అంగీకరించాలని కోరే హక్కు ఎవరికీ లేదు. ఈ విషయాన్ని చాలాకాలం క్రితమే మేము చెప్పాం. మరో సారి దాన్ని పునరుద్ఘాటించడం అవసరమని ఇప్పుడు భావిస్తున్నాం.

పైగా, ఒకపార్టీ కాంగ్రెసు ఆమోదించినా తీర్మానాలు, అది ఏ పార్టీ అయినప్పటికీ కూడా- అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఉమ్మడిపంథాగా భావించబడవు. ఆ పార్టీ నిర్ణయాలు ఇతర సోదరపార్టీలు ఖచ్చితంగా ఆమో దించాల్సిన అవసరం లేదని మేము లోగడా చెప్పాం; ఇప్పుడు మరోసారి చెప్పటం అవసరమనుకొంటున్నాం. మార్క్సిజం-లెనినిజమూ, అన్ని పార్టీలూ కలసి ఏకగ్రీవంగా ఆమోదించిన డాక్యుమెంట్లు మాత్రమే మేమూ ఇతర సోదరపార్టీలన్నీ ఆమోదించి అనుసరించాల్సిన ఉమ్మడి ప్రవర్తనా నియమావళి అవుతుంది.

# సోవియట్ పార్టీ నాయకత్వ రివిజనిజం పెరుగుదల

1957లో మాస్కో సమావేశం ఒక పత్రాన్ని ఏకగ్రీవంగా అంగీక రించిన తర్వాత, పత్రంలో పొందుపరచిన పంథాను సోవియట్ పార్టీ నాయ కత్వం అనుసరిస్తుందనీ, తమ తప్పిదాలను సరిదిద్దుకొంటుందనీ మేము ఆశించాము. మేమూ, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు సోదర పార్టీలు ఆశిం చినదానికి భిన్నంగా మాస్కో పత్రంలోని విప్లవ సిద్ధాంతాలనూ, సోదర పార్టీల, దేశాల సంబంధాలను నిర్దేశించే సూత్రాలనూ సోవియట్ పార్టీ నాయకత్వం మరింతగా ఉల్లంఘించుతూ వచ్చింది. మార్క్సిజం-లెనినిజం నుండీ, కార్మికవర్గ అంతర్జాతీయత నుండీ అంతకంతకూ దూరమైపోయింది

సోవియట్‌పార్టీ నాయకత్వం యొక్క రివిజనిజం పెరిగింది. ఈ పరిణామం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని విభేదాలను మరింతగా పెంచి కొత్తదశకు తీసుకు వెళ్ళింది.

అమెరికా సామ్రాజ్య వాదం, ప్రపంచ ప్రజల ఉమ్మడి శత్రువు అని 1957 పత్రం పేర్కొన్నది; ఇందుకు పూర్తివిరుద్ధంగా, అమెరికా సామ్రాజ్యవాదంతో మిలాఖతు కావడానికి సోవియట్‌పార్టీ నాయకత్వం పట్టుబట్టి కృషి చేసింది; సోవియట్, అమెరికాల అధిపతులు ప్రపంచ సమస్యలను పరిష్కరించ గలరని వాదించింది. ప్రత్యేకించి, కాంప్ దేవిడ్ సంభాషణల సమయంలో 1959 సెప్టెంబరులో ఐసెన్‌హూవర్‌ను కృశ్చేవ్ ఆకాశానికెత్తారు; "తన దేశ ప్రజల సంపూర్ణ విశ్వాసం చూరగొన్న" వ్యక్తిగానూ, "మనలాగానే శాంతిని సుస్థిరం చేయాలని ఆందోళన చెందుతున్న" వ్యక్తిగానూ ఐసెన్ హూవర్‌ను కృశ్చేవ్ వర్ణించారు. అంతేగాక "కాంప్ దేవిడ్ ఉత్తేజం అంతర్జాతీయ సంబంధాల్లో నూతన శకానిక చిహ్నమ"నీ, "చరిత్రలో ఒక మూల మలుపు" అనీ వర్ణించుతూ శ్రమకోర్చి సోవియట్‌పార్టీ నాయకులు ప్రచారంలో పెట్టారు. అయితే, అలాంటి ఉత్తేజం ఒక టున్నదనే మాటనే ఐసెన్ హోవర్ అంగీకరించలేదు.

1957 పత్రంలోని విప్లవ సిద్ధాంతాలను పూర్తిగా త్రోసివేసి, కృశ్చేవ్, తదితర నాయకులు తమ ప్రకటనల ద్వారానూ, సోవియట్ పత్రికల్లోనూ "శాంతియుత సహజీవనం", "శాంతియుత పోటీ", "శాంతియుత పరివర్తన" అనే తమ రివిజనిస్టు పంథాను విపులంగా ప్రచారం చేశారు; సామ్రాజ్యవాదుల 'విజ్ఞత'ను, 'సుహృద్భావాన్ని' పొగిడారు; భూగోళంలో అత్యధిక భాగం సామ్రాజ్యవాదుల పెత్తనం కింద, కంట్రోలు కింద ఇంకా ఉండగానే "ఆయుధాలు లేని, సాయుధదళాలు లేని యుద్ధాలు లేని ప్రపంచాన్ని" స్థాపించవచ్చుననీ, సంపూర్ణ సమగ్ర నిరాయుధీకరణల ద్వారా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల ఆర్థికాభివృద్ధిలో

నూతన యుగం ప్రారంభించవచ్చు" ననీ వగైరా వాదనలను ప్రబోధం చేశారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అనేక పుస్తకాలు, వ్యాసాలు ప్రచురించింది. వాటన్నింటిలోనూ మార్క్సిజం-లెనినిజంలోని మూల సిద్ధాంతాలను వక్రీకరించింది. వాటి విప్లవసారాన్ని నిర్వీర్యం చేసింది; తత్వశాస్త్రం, రాజకీయ అర్థశాస్త్రం, సోషలిస్టు కమ్యూనిస్టు సిద్ధాంతాలు, చరిత్ర, సాహిత్యం, కళారంగాల్లో సిద్ధాంతానికి సంబంధించిన అనేక ముఖ్య సమస్యలపైన తన రివిజనిస్టు భావాలను ప్రచారం చేసింది.

అంతర్జాతీయ ప్రజాతంత్ర సంఘాలపైన తన తప్పుడు భావాలను రుద్ది, వాటి సక్రమ మార్గాలను మార్చటానికి సోవియట్ పార్టీ నాయకత్వం ఉధృతంగా పనిచేసింది. 1960లో పెకింగ్‌లో జరిగిన ప్రపంచ ట్రేడ్ యూనియన్ల సమాఖ్య జనరల్ కౌన్సిల్ సమావేశంలో సోవియట్ కామ్రేడ్స్ ప్రవర్తన ఇందుకు ప్రబల తార్కాణం.

1957 పత్రంలో పొందుపరచిన సోదరపార్టీల, దేశాల మధ్య సంబంధాలను నిర్దేశించే సూత్రాలను పూర్తిగా త్రోసివేస్తూ, అమెరికా సామ్రాజ్యవాదుల మెరమెచ్చులకై చైనాకు వ్యతిరేకంగా కళ్ళేలేకుండా పనిచేశారు. మార్క్సిజం-లెనినిజానికి కట్టుబడి వ్యవహరించుతున్న చైనా కమ్యూనిస్టుపార్టీ తమ రివిజనిస్టు పంథాకు ఆటంకంగా వారు భావించారు. తమ ఆంతరంగిక సమస్యలను పరిష్కరించుకోగలిగామనీ, తమ వైఖరులను "స్థిరపరచు"కోగలిగామనీ వారు భావించుకొన్నారు; అందువల్ల, "శత్రువులతో స్నేహాన్ని నెరపుతూ, స్నేహితులతో కరకుగా వ్యవహరించే" తమ విధానాన్ని ఉధృతం చేయవచ్చునని భావించారు.

చైనాను సోవియట్ సైనిక కంట్రోలు కిందకు తీసుకెళ్ళే అసంబద్ధమైన డిమాండ్లను 1958 లో సోవియట్ నాయకత్వం చేసింది. ఈ అసంబద్ధమైన డిమాండ్లను చైనా ప్రభుత్వం న్యాయంగానూ, నిక్కచ్చిగానూ

నిరాకరించింది. అనతి కాలంలోనే, 1959 జూన్ నెల్లో సోవియట్ ప్రభుత్వం మరో పనిచేసింది. జాతీయరక్షణకై 1957 అక్టోబరులో చైనా-సోవియట్ యూనియన్ల మధ్య కుదిరిన నూతన సాంకేతిక ఒప్పందాన్ని సోవియట్ ప్రభుత్వం ఏకపక్షంగా చించివేసింది; ఆటంబాంబు నమూనాను, దాని తయారీకి సంబంధించిన సమాచారాన్ని చైనాకు ఇవ్వడానికి నిరాకరించింది.

ఆ తరువాత కృశ్చేవ్ అమెరికా పర్యటన చేయబోతున్న సందర్భంగా భారత-చైనా సరిహద్దు వివాదం గురించి సో.క.పా. నాయకులు చైనా పదేపదే చేస్తున్న అభ్యంతరాలను కూడా లెక్క చేయకుండా సెప్టెంబరు 9 వ తేదీన టాస్ వార్తాసంస్థకు ఒక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటనలో భారత అభివృద్ధి నిరోధకుల కొమ్ము కాశారు. ఈ విధంగా చైనా-రష్యాల మధ్యనున్న విభేదాలను సో క.పా. నాయకులు యావత్ప్రపంచం ముందు బహిర్గత పర్చారు.

కృశ్చేవ్ అమెరికా పర్యటన సందర్భంలో జాతీయ రక్షణకై కుదిరిన నూతన సాంకేతిక పరిజ్ఞాన ఒప్పందాన్ని చించి పారవేయడమూ, భారత చైనా సరిహద్దు ఘర్షణపై ఒక ప్రకటన విడుదలచేయడమూ, ఐసన్ హోవర్‌కు కానుకలు సమర్పించడమే; ఆ విధంగా అమెరికా సామ్రాజ్యవాదంతో మెరమెచ్చుల కోసమూ, "క్యాంప్‌డేవిడ్ ఉత్తేజం" సృష్టించటానికి సోవియట్ నాయకులు ప్రయత్నించారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ దేశీయ, విదేశీయ విధానాలపైన సోవియట్ పార్టీ నాయకత్వము, సోవియట్ ప్రచురణలు విషపూరితమైన దాడులు చేశాయి. ఈ దాడులన్నింటికీ కృశ్చేవ్ స్వయంగా నాయకత్వం వహించారు. చైనా సోషలిస్టు నిర్మాణం "స్టేజీపై కుప్పిగంతులు వేయటమే" నని, "రూళ్ళకర్ర సమానత్వాన్ని అమలు జరిపే కమ్యూనిజమనీ, చైనా

ప్రజల కమ్యూనిస్టు వస్తుతః అభివృద్ధి నిరోధకమైనవ"నీ కృశ్చేవ్ నిందించాడు. చైనా యుద్ధోన్మాద దేశమనీ "దుందుడుకుతనం"తో ప్రవర్తిస్తున్నదనీ-ఇంకా ఇలాంటి అపవాదులను అన్యాపదేశంగా వేశాడు. క్యాంప్ డేవిడ్ సంభాషణలు ముగించుకొని తిరిగి వచ్చాక "రెండు చైనాల" అమెరికా పన్నాగాన్ని చైనాకు అమ్మాలని ప్రయత్నించాడు; చైనా ప్రజా రిపబ్లిక్ పదవ వార్షికోత్సవం సందర్భంలో జరిగిన విందులో ఉపన్యాసమిస్తూ "పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క స్థిరత్వాన్ని బలప్రయోగం ద్వారా పరీక్షకు పెట్టవద్ద"ని చైనాకు కృశ్చేవ్ హితబోధ చేశారు.

సోవియట్ పార్టీ నాయకత్వం చేబట్టిన రివిజనిస్టు పంథా, చీలికను సృష్టించే మార్గాలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణులలో తీవ్రమైన గందరగోళాన్ని కలిగించాయి. ప్రపంచప్రజలకు అమెరికా సామ్రాజ్యవాదం ఇంకెంతమాత్రమూ ప్రధాన శత్రువు కాదన్నట్లు ప్రచారం సాగుతోంది. ఐసన్ హోవర్‌ను "శాంతిదూత"గా కొందరు కమ్యూనిస్టులు ఆహ్వానించారు. మార్క్సిజం-లెనినిజముకూ, 1957 పత్రానికీ కాలం తీరినట్లు వ్యవహరించడం జరుగుతోంది.

ఆ పరిస్థితుల్లో, మార్క్సిజం-లెనినిజాన్ని, 1957 పత్రాన్ని సంరక్షించటానికీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఏర్పడిన గందరగోళాన్ని తొలగించటానికి 1960 ఏప్రిల్‌లో చైనా కమ్యూనిస్టుపార్టీ "లెనినిజం చిరస్థాయి అగుగాక!" అన్న వ్యాసాన్ని, మరో రెండు వ్యాసాలను ప్రచురించింది. సిద్ధాంతాలకొరకు పట్టుదలతో పనిచేస్తూ, ఐక్యతను సంరక్షించాలన్న మా వైఖరి కనుగుణంగా 1957 పత్రంలోని విప్లవ సూత్రాలను, సామ్రాజ్యవాదము, యుద్ధము, శాంతి కార్మికవర్గ విప్లవము, కార్మికవర్గ నియంతృత్వమూ మొదలైన అంశాలకు సంబంధించిన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను వివరించటంపై మేము కేంద్రీకరించాము. ఆ మూడు వ్యాసాల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలు సోవియట్ పార్టీ నాయకులు ప్రచారం

చేస్తున్న అనేక తప్పుడు భావాలతో పూర్తిగా విభేదిస్తున్నాయి. అయినప్పటికీ, సోవియట్ పార్టీ కామ్రేడ్స్‌ను బహిరంగంగా విమర్శించకుండా మేము నిగ్రహం వహించాము; సామ్రాజ్యవాదులపైనా, యుగోస్లావియా రివిజనిస్టులపైనా మా పోరాటాన్ని కేంద్రీకరించాము.

"లెనినిజం చిరస్థాయి అగుగాక" అన్న వ్యాసానికి, ఇతర రెండు వ్యాసాలకూ వక్రభాష్యాలు చెప్పడానికి బహిరంగలేఖలో సోవియట్ పార్టీ చాలా శక్తిని వృథా చేసుకొన్నది; అయినప్పటికీ, తన దాడులను సమర్థించుకొనేందుకు బలమైన వాదనలను చెప్పలేకపోయింది. మేమీ ప్రశ్న అడగదలచాము; ఆనాటి పరిస్థితుల్లో, ప్రచారంలో పెట్టబడిన తప్పుడుభావాలను, అసంబద్ధమైన వాదనలను చూసి మేము మౌనంగా ఉండినట్లయితే ప్రస్తుత పరిణామం ఎలా ఉండేది? మార్క్సిజం-లెనినిజాన్ని 1957 పత్రాన్ని సంరక్షించటానికి ముందుకువచ్చే హక్కు, ఇంకా నిజం చెప్పాల్సివస్తే ఆ బాధ్యత మాపైన లేదా?

# చైనా కమ్యూనిస్టుపార్టీపైన సోవియట్ పార్టీ నాయకత్వ ఆకస్మిక దాడి

"లెనినిజం చిరస్థాయి అగుగాక", అన్న వ్యాసం, ఇతర రెండు వ్యాసాలూ మేము ప్రచురించిన వారంరోజుల తర్వాత సోవియట్ గగన సీమను అమెరికా యు-2 విమానం అతిక్రమించింది; ఆ విధంగా నాలుగు అగ్రరాజ్యాధిపతుల సమావేశాన్ని భగ్నంచేసింది. "కాంప్ డేవిడ్ ఉత్తేజం" పూర్తిగా అదృశ్యమైపోయింది. ఆ విధంగా మా అభిప్రాయాలను తర్వాత ఘటనలు ధృవపరచాయి.

ముఖ్యమైన శత్రువు నెదుర్కొంటున్న దృష్ట్యా, చైనా సోవియట్ కమ్యూనిస్టుపార్టీలు, ఇతర సోదర పార్టీలు తమ విభేదాలను తొలగించు

కొని, ఐక్యతను పటిష్టవంతం చేసుకొని, శత్రువుపైన ఉమ్మడిపోరాటాన్ని కొనసాగించవలసిన అగత్యం ఎంతైనా వుంది. కాని. జరిగింది అదికాదు. 1960 వేసవి కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో భేదాభిప్రాయాలు విస్తరించాయి; చైనా కమ్యూనిస్టు పార్టీమీద భారీయెత్తున దాడి ప్రారంభమైంది. చైనా సోవియట్ పార్టీల మధ్యగల సిద్ధాంత విభేదాలను సోవియట్ నాయకత్వం ప్రభుత్వాల మధ్య సంబంధాల దాకా తీసుకెళ్ళారు;

1960 జూన్ ప్రారంభంలో సోవియట్ పార్టీ కేంద్రకమిటీ ఒక ప్రతిపాదన చేసింది. జూన్ చివరి భాగంలో బుఖారెస్టులో జరుగబోయే రుమేనియా వర్కర్స్ (కమ్యూనిస్టు)పార్టీ తృతీయ మహాసభను అవకాశం చేసుకొని, సోషలిస్టు దేశాల కమ్యూనిస్టు వర్కర్సు పార్టీల ప్రతినిధుల సమావేశమై, నాలుగు రాజ్యాల శిఖరాగ్ర సమావేశాన్ని అమెరికా భగ్నం చేసింతర్వాత ఉత్పన్నమైన అంతర్జాతీయ పరిస్థితిపైన పరస్పరం సంభాషించుకోవాలని సూచించింది. అంత తొందరలో అలాంటి సమావేశం జరపటానికిగానీ, సోషలిస్టు దేశాల పార్టీల ప్రతినిధుల సమావేశాన్ని మాత్రమే జరపాలన్న భావాన్నిగాని చైనా కమ్యూనిస్టుపార్టీ అంగీకరించలేదు. ప్రపంచంలోని అన్ని కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీల ప్రతినిధుల సమావేశం జరపాలని మేము నిర్మాణాత్మక సూచన చేశాము; అలాంటి సమావేశాన్ని జయప్రదం చెయ్యటానికి తగినన్ని సన్నాహాలు గూడ ముందుగా చేయడం అవసరమని మేము చెప్పాము. మా సూచనకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అంగీకరించింది. రుమేనియా పార్టీ మహాసభకు హాజరైన సౌహార్ద ప్రతినిధులు అంతర్జాతీయ సమావేశం యెప్పుడు, ఎక్కడ జరపాలన్న అంశంపై పరస్పరం అభిప్రాయాలను వ్యక్తీకరించుకొనాలనీ, అయితే నిర్ణయం చేసుకోరాదనీ ఉభయ పార్టీలు అంగీకరించాయి.

ఆశ్చర్యకరమైన విషయమేమంటే, బుఖారెస్టులో సోవియట్ పార్టీ నాయకులు మాటతప్పి వ్యవహరించారు: చైనా కమ్యూనిస్టుపార్టీపైన ఆకస్మికంగా దాడిచేశారు; అమెరికా సామ్రాజ్యవాదంపైనగాక మామీద పోరాటాన్ని కేంద్రీకరింప జేశారు.

బుఖారెస్టులో సోదరపార్టీల ప్రతినిధుల సమావేశం జూన్ 24 నుండి 26 వరకూ జరిగింది. ఆ సమావేశం చైనాపార్టీకి "సోదరభావంతో సహాయం చేసిం"దంటూ సోవియట్ పార్టీ బహిరంగలేఖ వర్ణించడం శుద్ధ అబద్ధం.

కాని వాస్తవ మేమంటే, జూన్ 21 వ తేదీన సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ, చైనా పార్టీ కేంద్రకమిటీకి రాసిన సమాచారలేఖ ప్రతులను కృశ్చేవ్ నాయకత్వాన వచ్చిన సోవియట్ ప్రతినిధివర్గం సమావేశ సందర్భంలో సోదరపార్టీల ప్రతినిధులకూ, తదితరులకూ పంచిపెట్టారు. ఇతర పార్టీల ప్రతినిధులకు చదివి వినిపించారు. చైనా కమ్యూనిస్టుపార్టీపైన ఈ సమాచారం లేఖ నిరాధారమైన దాడి చేసింది. నీలాపనిందలు వేసింది; సోవియట్ పార్టీ నాయకత్వం విడుదలచేసిన చైనా వ్యతిరేక ప్రచార కార్యక్రమపత్రం అని దాన్ని వర్ణించితే సరిపోతుంది.

సమావేశంలో చైనా పార్టీపైన ప్లానుప్రకారం జరిగిన మూకుమ్మడి దాడికి కృశ్చేవ్ నాయకత్వం వహించారు. తన ప్రసంగంలో చైనా కమ్యూనిస్టుపార్టీని "పిచ్చివా"రనీ "యుద్ధాన్ని ప్రారంభించాలని కోరుకొంటున్నా"రనీ, "సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిదార్ల భావాలు భుజాన వేసుకొన్నా"రనీ, భారత-చైనా సరిహద్దు సమస్య విషయంలో "పచ్చి జాతీయవాదులు"గా వ్యవహరించారనీ, సోవియట్ పార్టీకి వ్యతిరేకంగా "ట్రాట్స్కీయిస్టు పద్ధతు"లను అవలంబిస్తున్నారనీ కృశ్చేవ్‌గారు ఉద్దేశ్యపూర్వకంగా దూషించారు. కృశ్చేవ్‌కు విధేయులైనవారు ఆయనమార్గాన్ని అనుసరించిన మరికొందరు సోదర పార్టీల ప్రతినిధులు గూడ చైనావారికి "పిడివాదాన్ని"

"అతివాద దుందుడుకు తనాన్ని, బూటకపు విప్లవవాదాన్ని" "ఒంటెత్తు పోకడల"నూ అంటగట్టారు. "యుగోస్లావియాకన్నా అధ్వాన్న" మనేటటు వంటి నిందలు కూడ విసిరారు.

అదే సమయంలో క్రుశ్చేవ్ ప్రారంభించిన ఈ ఆకస్మిక చైనా వ్యతిరేకదాడి అనేక సోదరపార్టీలకు విస్మయాన్ని కలిగించింది. సోవియట్ పార్టీ నాయకత్వం అవలంబించిన ఈ తప్పు వైఖరికి అనేక మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీల ప్రతినిధులు అభ్యంతరం చెప్పారు.

అదే సమావేశంలో ఆల్బేనియా లేబరు పార్టీ, సోవియట్ పార్టీ నాయకుల దుశిపింపుకు తలవంచ నిరాకరించింది; సోవియట్ నాయకుల ఒంటెత్తువాద కార్యకలాపాలను వ్యతిరేకించింది. అప్పటినుండీ సోవియట్ పార్టీ నాయకత్వం, ఆల్బేనియా పార్టీని తమ పక్కలో బల్లెంగా ఎంచు కొన్నది. ఆ తర్వాత ఆల్బేనియా పార్టీకి వ్యతిరేకంగా అనేక తీవ్రమైన చర్యలు తీసుకొన్నది.

చైనా పార్టీపైన సోవియట్‌పార్టీ నాయకత్వం చేసిన ఈ ఘాతుకమైన పిరికిదాడిని "సోదరభావంతో అందించిన సహాయం"అని పిలవొచ్చా? ఎంతమాత్రమూ వీల్లేదు. ఈ చైనా వ్యతిరేక ప్రదర్శనకు సోవియట్ నాయకత్వం అంతకుముందే ప్లాను చేసుకొన్నది; సోదర పార్టీలమధ్య సంబంధాలను నిర్దేశించే 1957 పత్రంలోని సిద్ధాంతాలను అతి నగ్నంగానూ, మొరటుగానూ ఉల్లంఘించింది. అది ఒక మార్క్సిస్టు- లెనినిస్టు పార్టీపైన రివిజనిస్టులు సాగించిన పెద్దదాడి. సోవియట్‌పార్టీ నాయకులు ఈ రివిజనిజానికి ప్రతినిధులు.

ఆ పరిస్థితుల్లో, సోవియట్ పార్టీకి వ్యతిరేకంగా కుక్కకాటుకు చెప్పుదెబ్బగా చైనాపార్టీ వ్యవహరించింది. మార్క్సిస్టు -లెనినిస్టు విధానాలనూ, సోదరపార్టీలమధ్య సంబంధాలను నిర్దేశించే 1957 పత్రంలోని సూత్రాలను చైనాపార్టీ సమర్థించింది. సమావేశం విడుదల చేసిన ప్రకటన

నలపై విశా ప్రయోజనాల దృష్ట్యా చైనాపార్టీ ప్రతినిధివర్గం సంతకం చేసింది. చైనాపార్టీ కేంద్ర కమిటీ ఆదేశం ప్రకారం జూన్ 26 న ఒక ప్రకటనను పంచిపెట్టింది. బుఖారెస్టు సమావేశంలో కృశ్చేవ్ ప్రవర్తన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చెడు సాంప్రదాయాన్ని సృష్టించిందని ఆ ప్రకటన పేర్కొన్నది. అందులో యిలా వుంది.

> "మార్క్సిజం-లెనినిజంకు సంబంధించిన అనేక మూల సిద్ధాంతాలపైన కామ్రేడ్ కృశ్చేవ్‌కు, మాకు భేదాభిప్రాయా లున్నాయి. అన్ని దేశాల ప్రజల అవసరాలు, వారు సాగించే పోరాటాలపైన, మార్క్సిజం- లెనినిజం ఇచ్చే మార్గదర్శకత్వంపైనా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ భవిష్యత్తు ఆధారపడి వున్నదే కాని, ఏ ఒక్క వ్యక్తో కర్ర ఝళిపింపుద్వారా నిర్ణయించజాలడు" ..."ఒక్క మార్క్సిజం-లెనినిజం యందే చైనా కమ్యూనిస్టు పార్టీ విశ్వాసముంచుతున్నది; మార్క్సిస్టు - లెనినిస్టు సత్యాలకే విధేయత చూపుతుంది; మార్క్సిజం-లెనినిజంకు భిన్నమైన తప్పు భావాలకు ఎన్నటికీ తలవొగ్గదు."

(అనుబంధం 2 చూడుడు)

బుఖారెస్టు సమావేశ సందర్భంలో చైనాపార్టీని లొంగదీసుకోవాలన్న విఫల ప్రయత్నంలో సోవియట్ పార్టీ నాయకులు బుద్ధితెచ్చుకోలేదు. బుఖారెస్టు సమావేశం ముగిసిన వెంటనే, చైనాపై ఒత్తిడి తీసుకురావటానికి వారు అనేక చర్యలు తీసుకొన్నారు. రెండు పార్టీల మధ్య ఉన్న సిద్ధాంత విభేదాలను ప్రభుత్వాలమధ్య సంబంధాలవరకూ తీసుకెళ్ళారు. చైనాలో ఉన్న సోవియట్ నిపుణులందరినీ ఒక్క నెలలో వెనక్కు పిలిపించుకోవాలని సోవియట్ ప్రభుత్వం ఆకస్మికంగా ఏకపక్ష నిర్ణయం చేసుకొన్నది; ఆ విధంగా, వందలకొలది ఒప్పందాలను కాంట్రాక్టులను చించి పారవేసింది. సోవియట యూనియన్‌లో "ద్రూజ్బా" (మైత్రి) అనే

పత్రికను చైనా ప్రచురించటానికే, చైనాలో "సూచింగ్ యూ హోవో" (సోవియట్-చైనా మైత్రి) అన్న పత్రికను సోవియట్ ప్రచురించడానికి, ఆ రెంటిని పరస్పరం పంపిణీ చేసుకోడానికి కుదుర్చుకొన్న ఒప్పందాన్ని సోవియట్ ప్రభుత్వం ఏకపక్షంగా చించి వేసింది. సోవియట్ యూనియన్ లోని చైనా రాయబార కార్యాలయ సిబ్బందిలోని ఒక సభ్యుణ్ని వెనక్కు పిలిపించుకోవాలంటూ చైనా ప్రభుత్వాన్ని డిమాండ్ చేసే నిర్హేతుకమైన చర్య కొడిగట్టింది. అంతేగాక చైనా-సోవియట్ సరిహద్దుల్లో ఇబ్బందుల్ని సృష్టించింది.

తమ దుడ్డుగర్రను ఝళిపించి, తన వందిమాగధులను చేరవేసి వారి చేత మూకుమ్మడి దాడిచేయించి, పెద్దయెత్తున రాజకీయ, ఆర్థిక ఒత్తిళ్ళు ప్రయోగించడం ద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీని లొంగదీసి మార్క్సిస్టు-లెనినిస్టు విధానాన్నీ, అంతర్జాతీయ కార్మికవర్గ దృక్పథాన్నీ వదలుకొటట్లు చేయవచ్చుననీ, తమ రివిజనిస్టు అగ్రరాజ్య దురహంకార పూరితమైన ఆదేశాలకు లొంగివుండేట్లు చేయవచ్చుననీ సోవియట్ పార్టీ నాయకులు తలపోశారు. కాని, కాకలు తీరిన దీర్ఘకాల పరీక్షలలో ఆరితేరిన చైనా కమ్యూనిస్టుపార్టీనీ, ప్రజలను ఓడించడం గానీ, లొంగదీసుకొనడం గానీ అసాధ్యమైన విషయం. మూకుమ్మడిగా దాడులు చేయడం ద్వారానూ, ఒత్తిళ్ళను ప్రయోగించడం ద్వారానూ మమ్మల్ని లొంగదీసుకో ప్రయత్నించిన వారు తప్పు అంచనాలు వేసుకొంటున్నారు.

చైనా-సోవియట్ సంబంధాలను సోవియట్ పార్టీ ఏ విధంగా విచ్ఛిన్నం చేసిందో మా ఇతర వ్యాసాల్లో మేము సవివరంగా తెలియజేస్తున్నాము. చైనా-సోవియట్ సంబంధాలను గురించి సోవియట్ పార్టీ బహిరంగ లేఖ అపవాదులు మాపైన వేస్తున్నది. సిద్ధాంత విభేదాలను ప్రభుత్వ స్థాయికి చైనాయే తీసుకెళ్ళిందంటున్నది; రెండు దేశాలమధ్య వ్యాపారాన్ని చైనాయే తగ్గించివేసిందని ప్రచారం చేస్తున్నది; కాని, చైనా

నుంచి తమ విభేదాలను సోవియట్ ప్రభుత్వమే ఏక పక్షంగా ఉపసంహరించుకొన్న వాస్తవాన్ని, వందలాది ఒప్పందాలనూ, కాంట్రాక్టులనూ చించిపారవేసిన సత్యాన్ని, సోవియట్ తీసుకున్న చర్యలవల్లనే రెండు దేశాలమధ్య వ్యాపారం తగ్గిపోయిన విషయాన్ని బహిరంగ లేఖలో ఉద్దేశ పూర్వకంగానే మరుగు పరచింది. ఇంతవరకు మాత్రమే ఇక్కడ మేము చెప్పదలిచాము. పార్టీ సభ్యులనూ, సోవియట్ ప్రజలనూ సోవియట్ పార్టీ అంత పచ్చిగా మోసం చేయ ప్రయత్నించడం నిజంగా విచారకరం.

## 1960లో జరిగిన సోదరపార్టీల సమావేశంలో రెండు పంథాల మధ్య పోరాటం

1960వ సంవత్సరం చివరి భాగంలో, కమ్యూనిస్టు కార్మికపార్టీల సమావేశం సందర్భంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో తీవ్ర సంఘర్షణ కొనసాగింది. అది మార్క్సిజం-లెనినిజానికి-రివిజనిస్టు పంథాకు మధ్య సంఘర్షణ. సూత్రాలకు కట్టుబడివుంటూ ఐక్యతను కాపాడే విధానానికి, సూత్రాలకు తిలోదకాలిచ్చి చీలికలు కల్పించే విధానానికి మధ్య సంఘర్షణ అది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తన తప్పుడు పంథానే మొండిగా పట్టుకు వ్రేళ్ళాడటం, తన తప్పుడు పంథాను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై రుద్దబూనడం, ఆ సమావేశం ముందు బట్టబయలయింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ విభేదాల తీవ్రతను నిశితంగానే గమనించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాల దృష్ట్యా, సోవి

యట్ కమ్యూనిస్టు పార్టీ తన తప్పుడు పంథాలో మరింత లోతుకు దిగ జారిపోదన్న ఆశతో మేము అనేక ప్రయత్నాలు చేశాము.

1960 సెప్టెంబరు 10వ తేదీన చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ జూన్ 21వ తేదీ సమాచార లేఖకు సమాధానం పంపింది. వాస్తవాలను చూపిస్తూ సకారణంగా పరిశీలిస్తూవున్న ఆ లేఖలో చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ-ప్రపంచ పరిస్థితుల అంత ర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన అనేక ముఖ్యమైన సమ స్యలపై క్రమబద్ధమైన వివరణ గావించింది. మామీద సోవియట్ కమ్యూ నిస్టుపార్టీ నాయకత్వపు దాడులను తిరస్కరించింది. దాని తప్పుడు భావా లను విమర్శించింది. విభేదాల పరిష్కారానికి, ఐక్యతా సాధనకు గాను ఐదు నిర్మాణాత్మక ప్రతిపాదనలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ముందుంచింది.

(5 ప్రతిపాదనలకు అనుబంధం III చూడండి.)

ఆ తరువాత చై. క. పార్టీ కేంద్ర కమిటీ సెప్టెంబరులో సో.క. పార్టీ కేంద్ర కమిటీ ప్రతినిధివర్గంతో సంప్రదింపులకై ఒక ప్రతినిధి వర్గాన్ని మాస్కోకు పంపింది. సో. క. పార్టీ నాయకత్వం అమెరికా సామ్రాజ్య వాదాన్ని ఆకర్షణీయంగా చిత్రిస్తూ అదే సందర్భంలో చైనా పట్ల దూషణకు పూనుకుంటూ, రెండు పార్టీలమధ్య సిద్ధాంత విభేదాలను ప్రభుత్వ సంబంధాల స్థాయికి తీసుకు పోవటాన్ని-ఆ విధంగా శత్రువులను సోదరులుగాను, సోదరులను శత్రువులుగాను, చూడటాన్ని అసంప్రదింపుల సందర్భంలో చై. క. పార్టీ ప్రతినిధివర్గం ఎత్తి చూపించి. వారి తప్పుడు వైఖరిని మార్చుకొమ్మనీ, సోదరపార్టీల దేశాలమధ్య సంబంధాలలో వర్తించే సూత్రాలను పాటించటానికి తిరిగిరమ్మనీ, ఉమ్మడి శత్రువుతో పోరాడేందుకై చైనా, సోవియట్ పార్టీల, దేశాలమధ్య ఐక్యతను దృఢ తర మొనరించ వలసిందిగానూ చై.క. పార్టీ ప్రతినిధి వర్గం సో.క. పార్టీ

నాయకులకు 'పదేపదే విజ్ఞాపన చేసింది. అయినప్పటికీ, సో.క. పార్టీ నాయకులు తమ తప్పులను సరిదిద్దుకోవాలన్న ఆలోచన యిసుమంతయినా చూపించలేదు.

ఈ విధంగా తీవ్రపోరాటం అనివార్యమయింది. సోదరపార్టీల సమావేశానికి డాక్యుమెంట్లను తయారు చేయటానికి 26 సోదరపార్టీల ప్రతినిధులు పాల్గొన్న డ్రాఫ్టింగు కమిటీలో ఈ పోరాటం మొదటగా సాగింది: ఆ తరువాత 81 సోదర పార్టీల ప్రతినిధులు సమావేశంలో కని విని ఎరుగని తీవ్రస్థాయికి చేరింది.

అక్టోబరు మాస్కోలో జరిగిన డ్రాఫ్టింగ్ కమిటీ సమావేశాలలో సో.క. పార్టీ నాయకులు తప్పుడు ఆలోచనా ధోరణితో గూడిన అభిప్రాయాలతో నిండిన తమ ముసాయిదా ప్రకటనను రుద్దటానికి ప్రయత్నించారు; చైనా కమ్యూనిస్టు పార్టీ, మరి కొన్ని సోదర పార్టీల ప్రతినిధి వర్గాల సూత్ర బద్ధమైన పోరాటం ఫలితంగా ఉద్రిక్త చర్చల అనంతరం డ్రాఫ్టింగ్ కమిటీ, సో.క. పార్టీ ప్రవేశపెట్టిన ముసాయిదా ప్రకటనలో ముఖ్యమైన సూత్రాలకు సంబంధించిన అనేక మార్పులను గావించింది. ముసాయిదాలో అత్యధిక భాగం విషయంలో కమిటీ ఒక అభిప్రాయానికి వచ్చింది. అయినప్పటికీ, వాగ్వాదాన్ని కొనసాగించాలన్న తమ పట్టుదల కొద్దీ సో.క.పా. నాయకత్వం ముసాయిదాలోని అనేక అంశాలపై ఏకీభావానికిరావటానికి అంగీకరించలేదు పైగా కృశ్చేవ్ న్యూయార్కు సందర్శించి వచ్చిన తరువాత కొన్ని సమస్యలమీద అంగీకారానికి వచ్చిన వాటినికూడా తుడిచి పారవేశాడు.

81 సోదరపార్టీల ప్రతినిధుల సమావేశం మాస్కోలో 1960 నవంబరులో జరుప బడింది. విభేదాలను తొలగించి ఐక్యతను దృఢ పర్చాలన్న చైనా తదితర అనేక ప్రతినిధి వర్గాల వాంఛను తృణీకరించి సమావేశ ప్రారంభంముందు చైనా కమ్యూనిస్టు పార్టీపై మరింత మొరటుగా దాడి

చేస్తున్న 127 పేజీల లేఖ నొకదానిని సో క.పా. నాయకత్వం మాస్కో చేరిన సోదర పార్టీల ప్రతినిధులకు పంచింది. ఆ విధంగా చర్చ తీవ్రతను రెచ్చగొట్టింది.

81 దేశాల సోదర పార్టీల ప్రతినిధుల సమావేశం జరుపబడిన అత్యంత అస్వాభావికమైన వాతావరణం అట్టిది. తమ అల్ప ప్రవర్తన ద్వారా, సో. క. పా. నాయకులు సమావేశాన్ని రసాభాస జరుగుతుందేమో నన్నంతవరకూ తీసుకెళ్ళారు. అయినా, సమావేశం చివరకు ఒక అంగీ కారానికి వచ్చింది. అనుకూల ఫలితాలే సాధించబడినవి. ఎందుకంటే చై. క. పా. మరికొన్ని సోదరపార్టీల ప్రతినిధివర్గాలు సూత్రాలకు కట్టుబడి వుంటూనే, పోరాటం సాగిస్తూనే ఐక్యతను కాపాడినందువల్లనే అత్యధిక సంఖ్యాక సోదరపార్టీల ప్రతినిధివర్గాలు చీలికనుగాక, ఐక్యతను కోరినందు వల్లనే.

ఆ సమావేశంలో చై. క. పార్టీ ప్రతినిధివర్గం "అది పూర్తిగా ఏకాకి ఐపోయే ప్రమాదం తలెత్తినందువల్లనే ప్రకటనపై సంతకంచేసింది" అని సో. క. పా. కేంద్ర కమిటీ తన బహిరంగలేఖలో పేర్కొన్నది. ఇది మరొక అసత్యం.

వాస్తవానికి అక్కడ జరిగిందేమిటి?

చైనా తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలను మెడలువంచి తమ రివిజనిస్టు ధోరణిని, భావాలను ఆమోదింపజేయునట్లు బలవంతం చేయ టానికి మెజారిటీ అని పిలువబడే దానిమీద ఆధారపడి సో.క. పా. నాయ కత్వం సమావేశానికి ముందు, సమావేశ కాలంలోనూ అనేక సోదర పార్టీలచేత చైనా కమ్యూనిస్టు పార్టీమీద మూకుమ్మడిగా దాడులు చేయిం చింది.

అయినప్పటికీ ఇతరులమీద ఏవో రుద్దటానికి సో. క. పా. నాయ కులు చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి 26 సోదర పార్టీల డ్రాఫ్టింగ్

కమిటీలోను, 81 సోదర పార్టీల ప్రతినిధుల సమావేశంలోనూ కూడా, వారు ప్రవేశపెట్టిన ముసాయిదా ప్రకటనలోని తప్పుడు సిద్ధాంతీకరణలలో అనేకం నిరాకరించబడినాయనేది వాస్తవంగా నిలిచింది. దానికి ఇవిగో కొన్ని ఉదాహరణలు :

శాంతియుత సహజీవనము, ఆర్థిక పోటీ అనేవే సోషలిస్టు దేశాల విదేశాంగ విధానంయొక్క సాధారణ పంథా అనే సో.క.పార్టీ నాయకత్వపు తప్పుడు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది.

పెట్టుబడిదారీ విధానం సాధారణ సంక్షోభంలో నూతన దశ రావడం శాంతియుత సహజీవనం, శాంతియుత పోటీల ఫలితంగానే ననే వారి తప్పుడు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది.

శాంతియుత పరివర్తనకు అవకాశాలు పెరుగుతున్న పరిస్థితి వున్నదనే వారి తప్పుడు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది.

నిర్మాణం విషయంలో ప్రధానంగా తమ కాళ్ళమీద తాము నిలబడాలనే విధానానికి వ్యతిరేకించటానికి వుద్దేశించబడిన, సోషలిస్టు దేశాల "ఏకాకిగా ప్రయాణం చేసే" విధానాన్ని వ్యతిరేకించటమనే, వారి తప్పు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో "కుట్రదార్ల కార్యకలాపాలను" "ముఠాగట్టే చర్యలను" వ్యతిరేకించడం అనబడే వారి తప్పుడు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది. సోదర పార్టీల మధ్య సంబంధాల విషయంలో స్వతంత్రం సమానత్వం అనే సూత్రాలను వదలివేసి సంప్రదింపుల ద్వారా ఏకాభిప్రాయానికి రావటానికి బదులు, మైనార్టీని మెజార్టీ అణచి వుంచే పద్ధతిని అవలంబించుతూ, సోదర పార్టీలు తమ కొరడాకు విధేయులై వుండాలనేందుకే ఈ సిద్ధాంతీకరణ వాస్తవంగా వుద్దేశించబడింది.

ఆధునిక రివిజనిజం యొక్క ప్రమాదాన్ని తక్కువ అంచనావేసే వారి తప్పుడు సిద్ధాంతీకరణ నిరాకరించబడింది.

చైనా, తదితర సోదర దేశాల ప్రతినిధివర్గాలు రూపొందించిన అనేక ముఖ్యసూత్రాలు ప్రకటనలో పొందుపరచబడినా యనేది వాస్తవం. సామ్రాజ్యవాదంయొక్క స్వభావం మారలేదు, మొత్తం ప్రపంచ ప్రజల శత్రువు అమెరికా సామ్రాజ్యవాదం, అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అత్యంత విస్తృతమైన ఐక్యసంఘటన నిర్మించటం; ప్రపంచ యుద్ధాన్ని ఆపడంలో ఒక ప్రధానశక్తి జాతీయ విముక్తి ఉద్యమం; నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలచే వారి జాతీయ ప్రజాతంత్ర విప్లవాన్ని సమగ్రంగా పూర్తిగా కొనసాగించబడటం, జాతీయ విముక్తి పోరాటాన్ని సోషలిస్టు దేశాలు అంతర్జాతీయ కార్మికవర్గము బలపరచడం, అమెరికా సామ్రాజ్యవాద రాజకీయ, ఆర్థిక, సైనిక పెత్తనాల క్రిందవున్న కొన్ని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో కార్మికవర్గము, ప్రజానీకమూ–అమెరికా సామ్రాజ్యవాద ఆధిపత్యానికి, గుత్తపెట్టుబడికి, వారి జాతీయ ప్రయోజనాలకు భంగం కల్గించే అభివృద్ధి నిరోధకశక్తులకు వ్యతిరేకంగా తమ కేంద్రీకరణను మరలించాల్సిన ఆవశ్యకత, సోదర దేశాల మధ్య సంప్రదింపుల ద్వారా ఏకాభిప్రాయానికి రావటమనే సూత్రం, మార్క్సిజం–లెనినిజం యొక్క విప్లవ తత్వాన్ని రివిజనిస్టు పంథాలో డొల్లజేయడానికి వ్యతిరేకంగా, మార్క్సిజం- లెనినిజానికి యుగోస్లావియా కమ్యూనిస్టు లీగ్ నాయకుల విద్రోహంమీద, అలాగే యింకా అనేక విషయాలమీద సిద్ధాంతీకరణలు చైనా తదితర సోదర పార్టీల ప్రతినిధివర్గాల అభిప్రాయాలను అంగీకరించిన ఫలితంగానే ప్రకటనలో వున్నాయనేదే వాస్తవం.

అయితే సో. క. పార్టీ నాయకులు తమ తప్పుడు ప్రతిపాదనలను తొలగించటానికి, ఇతర పార్టీల సరయిన ప్రతిపాదనలను ఆమోదించటానికి అంగీకరించిన తరువాత, చై. క. పార్టీ తదితర సోదర పార్టీల ప్రతినిధివర్గాలు కొన్ని కొన్ని మినహాయింపులకు అంగీకరించాయనే

విషయం కూడా పేర్కొనాల్సి వుంది. ఉదాహరణకు: సో.క. పార్టీ 20 వ కాంగ్రెసు, పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన పద్ధతులు, అనే సమస్యలమీద మేము భిన్నాభిప్రాయం కలిగివున్నాం. అయినా సో.క. పార్టీకి, మరికొన్ని సోదర పార్టీలకుగల అవసరాలు పరిగణించి ఆ రెండు సమస్యలమీదనూ 1957 ప్రకటనలో వుపయోగించబడిన పద జాలాన్నే వుపయోగించేందుకు మేము అంగీకరించాం. అయితే అదే సమయంలో 20 వ కాంగ్రెసును గూర్చి అలాంటి సూత్రీకరణలో మేము సరి పుచ్చుకొనటానికి అదే ఆఖరిసారి అని ఇకనెప్పుడూ అలా చేయబోమని కూడా సో. క. పార్టీ నాయకులకు స్పష్టంచేశాం.

1960 మాస్కో సమావేశంలో మొదటినుండి చివరివరకూ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని రెండు పంథాలమధ్య పోరాటం ప్రాధాన్యత వహించిందని పై వాటన్నింటివల్ల స్పష్టమౌతూనేవుంది. ఈ సమావేశంలో బహిర్గత మొనరించబడిన సో. క. పార్టీ నాయకత్వపు తప్పులు మరింత పెరిగిపోయాయి. సో. క. పార్టీ నాయకుల ముసాయిదా ప్రకటన, సమావేశంలో వారి ఉపన్యాసాలను చూస్తే 'శాంతియుత సహజీవనం' 'శాంతియుత పోటీ' 'శాంతియుత పరివర్తన' అనే తప్పుడు సిద్ధాంతాలతో గూడినది వారు సోదర పార్టీలమీద రుద్దబూనిన తప్పుడు లైనుయొక్క రాజకీయధోరణి అనీ, ఒంటెత్తు పోకడ, చీలికలు కల్పించే విధానాలు వారి నిర్మాణ పద్ధతనీ, స్పష్టమౌతున్నది. అది, మార్క్సిజం - లెనినిజానికి కార్మికవర్గ అంతర్జాతీయతకు ప్రాధమికంగానే విరుద్ధమైన రివిజనిస్టు పంథాయే. చైనా తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల ప్రతినిధివర్గాలు దానిని దృఢనిశ్చయంతో వ్యతిరేకించాయి. మార్క్సిజం-లెనినిజం, కార్మిక వర్గ అంతర్జాతీయతా పంథాకే నిశ్చయంగా నిలబడ్డాయి.

ఈ సమావేశంలో పోరాటంయొక్క ఫలిత మేమిటంటే - సో. క. పార్టీ నాయకత్వపు రివిజనిస్టుపంథా, భావాలు నిరసించబడ్డాయి. మార్క్సిస్టు

లెనినిస్టు పంథా గొప్ప విజయం పొందింది. సమావేశంలో ఆమోదించ బడిన ప్రకటనలో పొందుపరచబడిన విప్లవ సూత్రాలు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, ప్రపంచ శాంతికోసం, జాతీయ విముక్తికోసం ప్రజల ప్రజాతంత్రం, సోషలిజాలకోసం చేసే పోరాటంలో సోదరపార్టీల చేతిలో శక్తివంతమైన ఆయుధాలు. అవి ప్రపంచమంతటా మార్క్సిస్టు-లెనినిస్టు లకు ఆధునిక రివిజనిజంతో పోరాడడంలో కూడా శక్తివంతమైన ఆయు ధాలు.

మార్క్సిజం_లెనినిజానికి కట్టుబడిన సోదరపార్టీలు ఈ సమా వేశంలో, సో.క.పార్టీ తప్పుడు భావాలను గట్టిగా విమర్శించినాయి. సరైన అభిప్రాయాలను అనేకవాటిని వారిచేత అంగీకరింప జేసినవి. అలా చేయ టంతో వారు, సో.క.పార్టీ నాయకత్వం తనపై వచ్చే అతి చిన్న విమర్శ నైనా సహించలేని, తన మాటకు తిరుగు లేదనే అసాధారణ పరిస్థితిలో మార్పు తెచ్చారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఇది గొప్ప చారిత్రక ప్రాధాన్యతగల ఘటన.

చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం ఆ సమావేశంలో సంపూ ర్ణంగా ఏకాకి చేయబడింది అని సో. క. పార్టీ కేంద్రకమిటీ తన బహిరంగ లేఖలో చెప్పుకున్నది. ఇది కేవలం, సో. క. పార్టీ నాయకత్వం తన ఓట మిని విజయంగా చిత్రించుకొనటానికి చేసే సిగ్గుమాలిన ప్రయత్నం మాత్రమే.

ఆ సమావేశంలో పరస్పర సంఘీభావం, సోదరపార్టీల స్వతంత్రం, సమానత్వం, సంప్రదింపులద్వారా ఏకాభిప్రాయానికి రావటం అనే సూత్రాలు పాటించబడినాయి. మైనారిటీపై స్వారీజేయటానికి, ఇతర సోదరపార్టీలపై తమ అభిప్రాయాలను రుద్దటానికి, మెజారిటీని ఉపయోగించే సో. క. పార్టీ నాయకుల పొరపాటు ప్రయత్నాన్ని సాగనివ్వలేదు సోదర పార్టీలమధ్య విభేదాల పరిష్కారంలో మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు సూత్రాలకు అంటి

పెట్టుకొని, పోరాటాల్లో రాటుదేలుతూ, ఐక్యతను కాపాడుతూ వుండ వల సిన ఆవశ్యకతను మరొకసారి గుర్తింపజేసింది.

# క్రమబద్ధమైన రూపుదాల్చిన సోవియట్ నాయకత్వ రివిజనిజం

"1960 ప్రకటనపై చైనా నాయకులు ఒక ఎత్తుగడగానే సంత కాలు చేశార"ని సోవియట్ పార్టీ బహిరంగలేఖ వాదిస్తున్నది. అది వాస్త వమా? ఎంతమాత్రం కాదు ఎత్తుగడగా సంతకాలు చేసినవారు సోవియట్ నాయకులేగాని, మేము గాదు.

తమ ముసాయిదా ప్రకటనలోని తప్పు సూత్రీకరణలను మార్చ టానికి, లేదా తొలగించటానికి సోవియట్ నాయకులు అయిష్టంగా అంగీక రించారని వాస్తవాలు తెలుపుతున్నాయి; సోదరపార్టీలు చేసిన సరైన సూత్రీ కరణలను అంగీకరించడంలో సోవియట్ యూనియన్ నిజాయితీతో వ్యవహరించలేదని వాస్తవ ఘటనలు ధృవపరుస్తున్నాయి. సోదరపార్టీలు సమిష్టిగా అంగీకరించిన డాక్యుమెంటు అంటే వారికి చిల్లిగవ్వంత విలువ లేకుండా పోయింది. 1960 ప్రకటనపై వారు చేసిన సంతకం సిరా ఆరి పోకముందే దాన్ని భగ్నం చేయటం మొదలెట్టారు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ తరపున డిసెంబరు 1వ తారీకున కృశ్చేవ్ సంతకం చేశారు; కాని ఆ కృశ్చేవే ఆ తర్వాత 24 గంటలకే సోదరపార్టీ ప్రతినిధు లకు చేసిన విందు సందర్భంలో ప్రసంగిస్తూ సోదరపార్టీల అంగీకారాన్ని ఉల్లంఘిస్తూ యుగోస్లావియా సోషలిస్టు దేశమని వర్ణించాడు.

81 సోదరపార్టీల సమావేశానంతరం 1957 పత్రాన్ని, 1960 ప్రక

టననూ వమ్ము చేయడంలో సోవియట్ నాయకులు మరీ బరితెగి వ్యవహరించసాగారు. ఒకవంక, ప్రపంచ ప్రజల శత్రువుగా పేర్కొనబడిన అమెరికా సామ్రాజ్యవాదాన్ని తన మిత్రుడుగా ఎంచుకున్నారు; "అమెరికా-సోవియట్ సహకారం" అనే నినాదమిచ్చారు; కెనడీతో కలిసి "పరస్పర విశ్వాసం; అవగాహన, మిత్రత్వాలతో కూడిన వంతెనలను పది కాలాల పాటు నిలబడే వాటిని కట్టుకొందా"మని వాదించారు. మరోవంక కొన్ని సోదరపార్టీలనూ దేశాలనూ తమ శత్రువులుగా ఎంచుకున్నారు; అల్బేనియాతో సోవియట్ సంబంధాలను మరింత అధ్వాన్నంగా తయారు చేశారు.

మార్క్సిజం-లెనినిజాన్ని వ్యతిరేకించటానికీ, సోషలిస్టు శిబిరాన్నీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చడానికి సోవియట్ నాయకత్వం మరీ దిగజారి వ్యవహరించిన దనటానికి 22వ కాంగ్రెసు ఒక తార్కాణం. సోవియట్‌పార్టీ 20వ కాంగ్రెసు అనంతరం నాయకత్వం మెట్టుమెట్టుగా పెంచుకొంటూ వచ్చిన రివిజనిజాన్ని 22వ కాంగ్రెసు క్రమబద్ధం చేసింది.

22వ కాంగ్రెసులో అల్బేనియా లేబర్ (కమ్యూనిస్టు) పార్టీపైన సోవియట్‌పార్టీ నాయకత్వం పెద్దయెత్తున బహిరంగదాడి సాగించింది. కామ్రేడ్స్ అన్వర్ హాక్సా, మెహ్మెత షేహూగార్ల కిందగల అల్బేనియా నాయకత్వాన్ని కూలద్రోయ వలసిందిగా బహిరంగ పిలుపు ఇచ్చేంత వరకూ కృశ్చేవ్ తన ప్రసంగాన్ని తీసుకెళ్ళాడు. ఆ విధంగా సోదరపార్టీలపై దాడిచేసేందుకు ఒక పార్టీ కాంగ్రెసు వేదికను వినియోగించుకొనే దుర్మార్గపు సంప్రదాయాన్ని సోవియట్ నాయకత్వం సృష్టించింది.

సోవియట్ నాయకత్వం 22వ కాంగ్రెసులో చేసిన మరో ఘన కార్య మేమంటే, 20వ కాంగ్రెసులో స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించి ఐదేండ్లు జరిగిన తర్వాత, ఆయన మరణించి 8 ఏండ్లు పూర్తయిన తర్వాత మరో కేంద్రీకృతమైన సరికొత్తదాడి ఆయనపై సాగించడం.

తుదిమాటగా చెప్పాలంటే, మాస్కో-పత్రాన్నీ, ప్రకటననూ తోసి వేయటానికీ, మార్క్సిజం-లెనినిజాన్ని వ్యతిరేకించటానికీ, క్రమబద్ధమైన రివిజనిస్టు పంథాను అనుసరించటానికి వీటన్నిటినీ సోవియట్ నాయకత్వం చేసింది.

ఆ కాంగ్రెసు ఆమోదించిన సోవియట్ పార్టీ కార్యక్రమంలో రివిజ నిజం కేంద్రీకృత రూపంలో వుంది.

22వ కాంగ్రెసు విధానాన్ని "కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధుల సమావేశాలు అంగీకరించాయనీ. ఆ విధానం మాస్కో పత్రమూ, ప్రకటనల్లో ప్రతిబింబిస్తున్న"దనీ సోవియట్ పార్టీ కేంద్రకమిటీ బహిరంగ లేఖ వాదిస్తున్నది. అలాంటి ప్రకటన చేయటం సోవియట్ నాయకత్వానికిగల నిర్లక్ష్య భావానికి చిహ్నంకాదా? 1961లో జరిగిన విషయం, 1960లో జరిగిన కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీల సమావేశంలోనూ, అలాగే 1957 లోనే "ఎలా ఆమోదించ బడుతుంది" ఎలా "ప్రతిబింబించుతుంది?"

స్వంత గొప్పలు చెప్పుకొనే అటువంటి చిన్న విషయాలను కొంత సేపు అవలపెట్టి 2.వ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంలోని విషయాలకు వద్దాం.

కార్యక్రమాన్ని, అందుపై కృశ్చేవ్ సమర్పించిన నివేదికలను పైపైన చదివినప్పటికీ, అదొక పచ్చి రివిజనిస్టు కార్యాక్రమమనీ, మార్క్సిస్టు-లెనినిస్టు మూల సిద్ధాంతాలనూ, మాస్కో-పత్రం, మాస్కో-ప్రకటనల్లోని విప్లవ సూత్రాలనూ పూర్తిగా ఉల్లంఘించుతున్నదనీ అర్థమౌతుంది.

అనేక సిద్ధాంత సమస్యలపైన 1957 పత్రం, 1960 ప్రకటనలకు అది వ్యతిరేకంగా పోతున్నది. 19 0 సోదరపార్టీల సమావేశంలో తిరస్కరింపబడిన సోవియట్ నాయకత్వ తప్పుడు భావాలు తిరిగి అవతరించాయి. ఉదాహరణకు, శాంతియుత సహజీవనాన్ని విదేశాంగ విధానపు సాధారణ

(జనరల్) సిద్ధాంతంగా వర్ణిస్తున్నది;శాంతియుత పరివర్తన అవకాశాన్ని ఏక పక్షంగానొక్కి చెబుతున్నది;ఒకసోషలిస్టుదేశం నిర్మాణంలో ప్రధానంగాతన సొంత కృషిపైనా ఆధారపడటమనేది 'ఒంటరిగా ప్రయాణం చెయ్యటం'గా వర్ణిస్తోంది. 20వ కాంగ్రెసు అనంతరం-సోవియట్ పార్టీ అనుసరించిన తప్పు మార్గాన్ని ఈ కార్యక్రమం ఒకఅడుగు ముందుకు తీసుకెళ్ళి క్రమబద్ధం చేసింది. అందులోవున్న ప్రధాన విషయం "శాంతియుత సహజీవనం"; "శాంతియుత పోటీ," "శాంతియుత పరివర్తన."

మార్క్సిజం-లెనినిజంలోని సారాన్ని ఆ కార్యక్రమం మొరటుగా తిరగదోడుతున్నది: కార్మికవర్గ విప్లవం, కార్మికవర్గ నియంతృత్వం, కార్మిక వర్గపార్టీ, అనే విషయాలపై మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను తిరగ దోడుతున్నది; సోవియట్ యూనియన్‌లో కార్మికవర్గ నియంతృత్వం ఇంకెంతమాత్రమూ పనిలేదని చాటుచున్నది; సోవియట్ కమ్యూనిస్టు పార్టీకిగల కార్మికవర్గ అగ్రగామి స్వభావం మారిపోయిందనీ, "ప్రజలందరి ప్రభుత్వము, ప్రజలందరిపార్టీ" అనే తప్పుడు సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నది.

మార్క్సిస్టు-లెనినిస్టు వర్గపోరాట సిద్ధాంత స్థానంలో మానవతా వాదాన్ని, కమ్యూనిస్టు ఆశయాలకు బదులు బూర్జువా వినాదాలైన "స్వాతంత్ర్యం", "సమానత్వం", సౌభ్రాతృత్వాలను చొప్పించటానికి ప్రయత్నిస్తోంది.

సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ వ్యవస్థల్లో ఇంకా నివసిస్తూ ప్రపంచ జనాభాలో మూడింట రెండు వంతులుగల ప్రజలు విప్లవాలు తీసుకు రాకూడదనీ, అలాగే సోషలిస్టు మార్గంలో నడుస్తూ ప్రపంచ జనాభాలో మూడింట ఒకవంతు గల ప్రజలు తాము విప్లవాన్ని తుదికంటూ తీసుకెళ్ళి సంపూర్తి చేయరాదనీ ఆ కార్యక్రమం ఆదేశిస్తున్నది. అది పెట్టుబడిదారీ

విధానాన్ని పరిరక్షించటానికీ, లేదా పునః స్థాపించటానికీ తోడ్పడే రివిజనిస్టు కార్యక్రమము.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ కాంగ్రెసు చేసిన తప్పులను చైనా కమ్యూనిస్టుపార్టీ ఖండితంగా వ్యతిరేకించింది. ఆ కాంగ్రెసుకు హాజరైన చైనా ప్రతినిధివర్గ నాయకుడు చౌ-ఎన్‌లై తన ప్రసంగంలో మా పార్టీ వైఖరి వివరించారు; ఆ తర్వాత, సోవియట్ నాయకులతోనూ, కృశ్చేవ్‌తోనూ జరిపిన సంభాషణల్లో సోవియట్ నాయకుల తప్పులను నిర్మొహమాటంగా విమర్శించారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గంతో మాట్లాడుతూ మా విమర్శలను, సలహాలను కృశ్చేవ్ తిరస్కరించారు; అంతేగాక, చైనా కమ్యూనిస్టుపార్టీలోని పార్టీ వ్యతిరేక ముఠాను పరోక్షంగా బలపరిచాడు. 20 వ కాంగ్రెసు తర్వాత, "స్టాలిన్‌కు భిన్నమైన పంథాను" (అంటే, రివిజనిస్టు పంథాను అనుసరించడం మొదలుపెట్టినప్పుడు)సోవియట్‌పార్టీ నాయకత్వం చేబట్టినప్పుడు తమకు సోదరపార్టీల సహాయం అవసరమైందని కృశ్చేవ్ బహిరంగంగా ప్రకటించాడు. ఆనాడు "చైనా కమ్యూనిస్టుపార్టీ వాణి మాకు చాల ప్రాధాన్యత గలది," కాని, "ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి." "మేమిప్పుడు బాగానే వున్నాము," "మా దారిన మేము పోతాము" అని ఆయన చెప్పాడు.

కృశ్చేవ్ మాటలనుబట్టి, రివిజనిస్టు విచ్ఛిన్నకర మార్గాన్నే పోవటానికి సోవియట్‌పార్టీ నాయకత్వం తీర్మానించుకున్నట్లు స్పష్టంగా అర్థమౌతున్నది. కామ్రేడ్స్ అనేభావంతో వారికి చైనా కమ్యూనిస్టుపార్టీ పలుసార్లు సలహాలిచ్చినప్పటికీ, వారు పూర్తిగా నిర్లక్ష్యం చేశారు; తమ పద్ధతులను సవరించుకోవాలన్న ఉద్దేశ్యం లేశమాత్రం కూడా చూపలేదు

# మార్క్సిజం - లెనినిజంకు విరుద్ధమైన వైఖరి-అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చేధోరణి

చైనా, సోవియట్ పార్టీలమధ్య సత్సంబంధాలను పెంచటానికీ, సోదరపార్టీలు దేశాలమధ్య ఐక్యతను పటిష్టవంతం చేయటానికి 22 వ కాంగ్రెసు తర్వాత తాము "నూతన చర్యలు తీసుకున్నా"మని ప్రజలను నమ్మించడానికి తమ బహిరంగ లేఖలో సోవియట్ నాయకులు చాల కష్టపడ్డారు.

ఇది మరో అబద్ధం.

మరి వాస్తవాలేమిటి?

సోదరపార్టీల మధ్య, దేశాలమధ్య సంబంధాలను నిర్దేశించే సూత్రాలను ఉల్లంఘించటంలోనూ, అగ్రరాజ్య దురహంకార విధానాన్ని, సెక్టేరియనిజం, చీలికను సృష్టించే పద్ధతులను అనుసరించడంలోనూ సోవియట్ పార్టీ నాయకత్వం అడ్డూ ఆపూ లేకుండా వ్యవహరించినట్లు వాస్తవ ఘటనలు తెలుపుతున్నాయి; ఆ విధంగా, మార్క్సిజం-లెనినిజానికి వ్యతిరేకమైన తమ క్రమబద్ధమైన రివిజనిజాన్ని పెంపుచేసుకో యత్నించింది. దీనివల్ల చైనా-సోవియట్ సంబంధాలు రానురాను మరింతగా అధ్వాన్నమౌతూ వచ్చాయి; సోదరపార్టీల, దేశాలమధ్య ఐక్యతకు పెద్ద నష్టాన్ని కలుగజేశాయి.

చైనా-సోవియట్ ఐక్యతను, సోదరపార్టీల, దేశాలమధ్య ఐక్యతను దెబ్బతీయటానికి 22 వ కాంగ్రెసు తర్వాత సోవియట్ పార్టీ నాయకత్వం తీసుకొన్న వాస్తవ చర్యలు దిగువ ఇస్తున్నాము.

1. తమ తప్పుమార్గాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై రుద్దడానికి సోవియట్ పార్టీ నాయకులు తీవ్రంగా ప్రయత్నించారు. మాస్కో-పత్రం, మాస్కో ప్రకటనలకు బదులు తమ రివిజనిస్టు కార్యక్రమాన్ని చొప్పించ ప్రయత్నించారు. తమ తప్పు పంథాను "ఇటీవలి కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క లెనినిస్టు విధానాల సమగ్ర రూపంగా వర్ణించుతున్నారు. కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీలకు, సోషలిస్టు శిబిరంలోని అన్నిదేశాల ప్రజలకూ "నేటి కాలపు కమ్యూనిస్టు ప్రణాళిక" (మానిఫేస్టో)గానూ, "ఉమ్మడి కార్యక్రమం"గానూ తమ రివిజనిస్టు కార్యక్రమాన్ని అభివర్ణించారు.

సోవియట్ పార్టీ తప్పుమార్గాన్ని, కార్యక్రమాన్ని నిరాకరించి, మార్క్సిస్టు-లెనినిస్టు మూల సూత్రాలకోసమూ, మాస్కో-పత్రం,మాస్కో-ప్రకటనల్లోని విప్లవకర సిద్ధాంతాలకోసమూ పట్టుదలగా పనిచేసే సోదర పార్టీని సోవియట్ పార్టీ నాయకులు తమ శత్రువుగా ఎంచుతున్నారు; అలాంటి సోదర పార్టీకి వ్యతిరేకంగా దాడిచేసి నొప్పించటానికి, అన్ని పద్ధతులకూ దిగి ఆ పార్టీ నాయకత్వాన్ని కూలదోయటానికి సోవియట్ పార్టీ నాయకులు ప్రయత్నిస్తున్నారు.

2. పర్యవసానాలను సరకు చేయకుండా సోషలిస్టు అల్బేనియాతో సోవియట్ నాయకత్వం దౌత్య సంబంధాలు తెంచివేసుకున్నది; ఇది సోదరపార్టీల మధ్య, సోదరదేశాల మధ్యగల సంబంధాల చరిత్రలోనే అపూర్వం.

3. చైనాపైన సోవియట్ యూనియన్ ఒత్తిడి తెస్తూనే వుంది; చైనా కమ్యూనిస్టుపార్టీపైన దారుణమైన దాడులు చేస్తూనే వుంది. 1962 ఫిబ్రవరి 22 న చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి ఒక లేఖవ్రాస్తూ చైనాపార్టీ "తన సొంత ప్రత్యేక వైఖరి"ని అనుసరిస్తోందనీ, సోదరపార్టీలనుసరించే సమిష్టి విధానానికి భిన్నమైన మార్గాన్ని తొక్కుతున్నదనీ ఆరోపించింది; అంతేగాక, అల్బేనియా మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీకి మేము

సహకారం అందివ్వడం నేరమనేంతవరకు వెళ్ళింది. చైనా - సోవియట్ సంబంధాలు మెరుగు కావాలంటే చైనాపార్టీ తన మార్క్సిస్టు - లెనినిస్టు కార్మికవర్గ అంతర్జాతీయ వైఖరిని వదలుకోవాలని సోవియట్‌పార్టీ షరతు పెట్టింది; మాస్కో-పత్రమూ, ప్రకటనల్లోని విప్లవ సిద్ధాంతాల కనుగుణ్య మైన తన వైఖరిని చైనా పార్టీ విడనాడాలనీ, తమ తప్పు వైఖరిని ఆమోదించాలనీ, సోదరపార్టీలు దేశాలమధ్య సంబంధాలను నిర్దేశించే సూత్రాలను సోవియట్‌ పార్టీ ఉల్లంఘించటాన్ని అంగీకరించాలనీ చైనాపార్టీపైన ఒత్తిడి తెస్తున్నారు. ఆ కాలంలో చైనాపార్టీ కేంద్ర కమిటీకి వారు రాసిన లేఖలను గూర్చి, సోవియట్ యూనియన్‌లోని మా రాయబారితో 1962 అక్టోబరులో కృశ్చేవ్ ఐక్యతకంటూ చేసిన సూచనలను గూర్చి తన బహిరంగ లేఖలో సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ ఘరానాగా చెప్పుకొన్నది; వాస్తవానికి యివన్నీ తమ నీచ ప్రయత్నాన్ని నెరవేర్చుకొనటానికి చేసిన పనులే.

4. సోదరపార్టీల ప్రతినిధుల సమావేశం ఏర్పాటు చేయాలని ఇండోనీషియా, వియత్నామ్, న్యూజిలాండ్ పార్టీలు ప్రతిపాదించాయి; సోదరపార్టీల సమావేశానికి సన్నాహాలు చేయడానికై ఐదు అంశాలతో కూడిన ప్రతిపాదనను చైనాపార్టీ కేంద్రకమిటీ 1962 ఏప్రిల్ 7 వ తేదీన చేసింది; వీటన్నింటినీ సోవియట్‌పార్టీ నిరాకరించింది. 1962 మే నెల 30 వ తేదీన చైనాపార్టీ కేంద్రకమిటీకి సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ సమాధానంరాస్తూ సోవియట్-అల్బేనియా సంబంధాలు మెరుగు కావాలంటే, సోదరపార్టీల సమావేశం జరగాలంటే అల్బేనియాపార్టీ తన ప్రస్తుత వైఖరి విడనాడాలని షరతుపెట్టింది.

5. చైనాకు చెందిన సింకియాంగ్‌లోగల తమ మనుష్యులు పత్రికలద్వారా సోవియట్ నాయకులు 1962 ఏప్రిల్, మే నెలల్లో ఇలీ ప్రాంతంలో విచ్ఛిన్న కార్యకలాపాలు సాగించారు : వేలకొలది చైనా

పౌరులను సోవియట్ భూభాగంలోకి బలవంతాన వెళ్ళేట్లు చేశారు. ప్రలోభ పెట్టారు. చైనా ప్రభుత్వం పదేపదే నిరసనలు తెలియజేసింది; అనేకమార్లు రాయబారాలు నడిపింది; కాని "సోవియట్ సాంప్రదాయం" "మానవతా వాదం" అనే సాకులు చెప్పి చైనీయులను తిప్పి పంపడానికి నిరాకరించింది. ఈనాటికిగూడా ఈ సమస్య పరిష్కారం కానేలేదు. ఇది చాలా వింతైన ఘటన; సోషలిస్టు దేశాల సంబంధాల చరిత్రలోనే కనీ వినీ ఎరుగనిది.

6. అణ్వస్త్రయుధాల విస్తరణను నిషేధించుతూ అమెరికాతో ఒప్పందం కుదుర్చుకోడానికి తాము సిద్ధంగా వున్నట్లు చైనా ప్రభుత్వానికి సోవియట్ ప్రభుత్వం 1962 ఆగస్టులో లాంఛన ప్రాయంగా తెలియజేసింది. అణ్వాయుధాలపై గుత్తాధికారాన్ని సంపాదించుకొనటానికై అమెరికా-సోవియట్ యూనియన్లు జాయింటుగా వేసిన ఎత్తుగడ ఇది; అమెరికా అణ్వస్త్ర బెదిరింపులను ప్రతిఘటించేందుకై అణ్వస్త్రలను కలిగివుంచే హక్కు చైనాకు లేకుండా చేయడానికై వేసిన పన్నుగడ ఇది. ఇందుకు వ్యతిరేకంగా చైనా ప్రభుత్వం పలుసార్లు తన నిరసనను తెలియపరచింది.

7. సోషలిస్టు శిబిరం యొక్క, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క ప్రయోజనాలను ఫణంగా పెట్టి అయినాసరే అమెరికా సామ్రాజ్యవాదులతో రాజకీయ బేరసారాలు సాగించాలనీ, కెన్నడీతో అభివృద్ధి నిరోధకంగా ముఠా కట్టాలనీ సోవియట్ నాయకులు తహతహపడ్డారు; అందుకై పట్టు విడవకుండా పనిచేశారు. ఇందుకు బ్రహ్మాండమైన తార్కాణం కరిబియన్ సంక్షోభంలో సోవియట్ పార్టీ నాయకత్వం లొంగుబాటు వైఖరిని ప్రదర్శించడం; అమెరికా సామ్రాజ్యవాదుల అణు బెదిరింపులకు లొంగిపోయి, క్యూబా సార్వభౌమాధికారాన్ని ఉల్లంఘించే "అంత

ర్జాతీయ పర్యవేక్షణ" అన్న అమెరికా ప్రభుత్వం డిమాండును అంగీక రించటం.

8. భారత అభివృద్ధి నిరోధకులతో కుమ్మక్కు కావడానికి సో.క. పార్టీ నాయకత్వం తహతహ లాడింది. సోషలిస్టు చైనాకు వ్యతిరేకంగా నెహ్రూతో అభివృద్ధి నిరోధక కూటమి కట్టడానికి సిద్ధపడింది. భారత, చైనా సరిహద్దు సంఘర్షణలో సో.క. పార్టీ నాయకత్వమూ, పత్రికలూ భారత అభివృద్ధి నిరోధకులను బాహాటంగా సమర్థించాయి. చైనా తీసుకున్న న్యాయమైన వైఖరిని ఖండించాయి. నెహ్రూ ప్రభుత్వాన్ని సమర్థించాయి. భారత అభివృద్ధి నిరోధకులు సరిహద్దు సంఘర్షణను ప్రారంభించిన నాటి నుండి సోవియట్ ఇండియాకు చేసిన ఆర్థిక సహాయం మొత్తం సహా యంలో మూడింట రెండువంతులుంది. 1962 ఆకురాలు కాలంలో భారత-చైనా సరిహద్దులో భారీ యుద్ధం ప్రారంభమైన తరువాత కూడా సో.క. పార్టీ నాయకులు భారత అభివృద్ధి నిరోధకులకు సైనిక సహాయం అంది స్తూనే ఉన్నారు.

9. యుగోస్లావియా టిటో ముఠాతో కుమ్మక్కు కావాలని, మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలకు వ్యతిరేకంగా వారితో ముఠా కట్టాలని సోవియట్ పార్టీ నాయకత్వం తహతహలాడుతూ పనిచేసింది 22వ కాంగ్రెసు తర్వాత, టిటో ముఠాపై మాస్కో ప్రకటన ఇచ్చిన తీర్పును తారుమారు చేసే అనేక చర్యలు తీసుకొన్నారు. ప్రకటనను చించి పార వేశారు.

10. 1962 నవంబరు తర్వాత అంతర్జాతీయ స్థాయిలో చైనా కమ్యూనిస్టు పార్టీమీద, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలమీద సోవియట్ పార్టీ నాయకత్వం మరింత భయంకరమైన దాడులు సాగించింది; సోషలిస్టు శిబిరాన్ని, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చేందుకై సరికొత్త వ్యతిరేక ప్రచారాన్ని రెచ్చగొట్టింది. అనేక సమస్యలపైన చైనా కమ్యూ

నిస్టుపార్టీపై దాడిచేస్తూ కృశ్చేవ్ ప్రకటన వెంబడి ప్రకటన ఇచ్చాడు; సోవియట్ పత్రికలు వందలకొలదీ వ్యాసాలు రాశాయి. బుల్గేరియా, హంగెరీ, జెకొస్లొవేకియా, ఇటలీ, జర్మనీ ప్రజాతంత్ర రిపబ్లిక్కుల పార్టీల మహా సభలు సోవియట్ నాయకులు పురికొల్పిన ఫలితంగా చైనా వ్యతిరేక ప్రదర్శనలకు వేదికలుగా తయారయ్యాయి; చైనా కమ్యూనిస్టుపార్టీ, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలపై దాడిచేస్తూ 40 సోదర పార్టీలకుపైగా తీర్మానాలనూ, ప్రకటనలనూ లేదా వ్యాసాలనూ ప్రచురించాయి.

పై నుదహరించిన వాస్తవాలను నిరాకరించడం సోవియట్‌పార్టీ నాయకులకు సాధ్యంగానిపని. ఈ కఠోర సత్యాలు నిర్ధారణ చేస్తున్న విషయాలేమిటి? 22వ కాంగ్రెసు తర్వాత వారు తీసుకున్న "కొత్త చర్యలు" చైనా-సోవియట్ సంబంధాలు మెరుగు పరచేందుకుకాదు, సోదర పార్టీలమధ్య, దేశాలమధ్యా ఐక్యతను పటిష్టవంతం చేసేందుకు కాదు; సోషలిస్టు శిబిరంలోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ, చీలికను మరింత పెద్దది చేయడానికై అమెరికా సామ్రాజ్యవాదులతోనూ, భారత అభివృద్ధి నిరోధకులతోనూ, విద్రోహి టిటోతోనూ కుమ్మక్కు కావడాని కుద్దేశించినట్టివే.

ఇలాంటి తీవ్ర పరిస్థితుల్లో కొన్ని సోదర పార్టీలు చేసిన దాడులకు బహిరంగ సమాధానాలివ్వడం మినహా చైనాపార్టీకి మరో గత్యంతరం లేకపోయింది. 1962 డిసెంబరు 15, 1963 మార్చి 8 లోగా అలాంటి సమాధానాలను ఏడింటిని మేము ప్రచురించాము. ఆ వ్యాసాల్లో మేము కొంత వెసులుబాటు చూపించుతూ పేరెత్తి సోవియట్‌పార్టీ నాయకత్వాన్ని విమర్శించలేదు.

సోవియట్‌పార్టీ నాయకత్వం చేసిన తప్పుల ఫలితంగా చైనా-సోవియట్ సంబంధాలు అధ్వాన్నమైనప్పటికీ, సంప్రతింపులకై తన ప్రతినిధి వర్గాన్ని చైనా కమ్యూనిస్టుపార్టీ మాస్కోకు పంపడానికి అంగీకరిం

చింది; సంభాషణల్లో క్రమపద్ధతిలో అభిప్రాయాల వ్యక్తీకరణ జరిగేందుకు వీలుగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ పంథాకై ఒక ప్రతిపాదనను సోవియట్‌పార్టీకి సమాధానంగా జూన్ 14న చైనాపార్టీ కేంద్ర కమిటీ లేఖలో సూచించింది.

తర్వాత జరిగిన వాస్తవాలు ధృవపరుస్తున్న దేమిటి? సోవియట్ పార్టీ నాయకులు భేదాభిప్రాయాలను తొలగించుకొని, ఐక్యతను పెంపొందించుకొనడానికి నిజాయితీగా పనిచేయక పోవడమేగాక, చైనా-సోవియట్ సంబంధాలను మరీ అధ్వాన్నం చేస్తున్న వారి చర్యలను కప్పిపుచ్చుకొనడానికి సంప్రతింపుల నొక ముసుగుగా ఉపయోగించుకొన ప్రయత్నించారు.

సంభాషణలు జరగనున్న సందర్భంలో చైనా కమ్యూనిస్టు పార్టీ మీద సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు ప్రకటనలు, తీర్మానాలద్వారా పేరుపెట్టి దాడిచేశారు. అదే సమయంలో చైనా దౌత్య కార్యాలయ సిబ్బందినీ రీసెర్చి (పరిశోధన) విద్యార్థులనూ అనేకమందిని అక్రమంగా సోవియట్ యూనియన్‌నుండి వెళ్ళగొట్టారు.

జూలై 14న, అమెరికా బ్రిటన్-సోవియట్ యూనియన్ల సంప్రతింపులు ప్రారంభం కానున్న సమయంలో, చైనా సోవియట్ సంప్రతింపులు ఇంకా కొనసాగుతుండగానే సోవియట్‌లోని అన్ని పార్టీ యూనియట్లకు, పార్టీ సభ్యులకు ఒక బహిరంగ లేఖను సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ తొందరపాటుగా ప్రచురించింది; చైనా కమ్యూనిస్టు పార్టీమీద అడ్డులేని ఆరోపణలు చేసింది. అమెరికా సామ్రాజ్యవాదుల మెరమెచ్చులకై సోవియట్ పార్టీ నాయకులు వీరికి సమర్పించిన మరో పవిత్ర కానుక ఇది.

ఆ వెంటనే అణ్వాస్త్రపాక్షిక నిషేధ ఒడంబడికపైన అమెరికా, బ్రిటన్లతో కలిసి సోవియట్ నాయకులు మాస్కోలో సంతకం చేశారు; ఆ

విధంగా సోవియట్ ప్రజలయొక్క, చైనా ప్రజలతో సహా మొత్తం సోషలిస్టు శిబిరంలోని ప్రజలయొక్క, ప్రపంచంలోని శాంతికాముక ప్రజలందరి ప్రయోజనాలకు వారు ద్రోహంచేశారు. సోవియట్ యూనియన్, ఇండియాల మధ్య సంబంధాలజోరు పెరిగింది. విశ్రాంతి కొరకై కృశ్చేవ్ యుగోస్లావియా వెళ్ళారు; సోవియట్ పత్రికలు చైనా వ్యతిరేక ప్రచారాన్ని ఉన్మాద పూరితంగా సాగించాయి; ఇలాంటివే అనేకం సోవియట్ నాయకులు చేశారు. ఫలితాలను లక్ష్యపెట్టకుండా, సోదర సోషలిస్టు దేశాలకూ, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకూ వ్యతిరేకంగా సోవియట్ పార్టీ నాయకులు సామ్రాజ్యవాదులతోనూ, అన్ని దేశాల అభివృద్ధి నిరోధకులతోనూ, విద్రోహి టిటో ముఠాతోను ఐక్యమౌతున్నారని ఈ ఘటనలన్నీ స్పష్టంగా తెలియజేస్తున్నాయి. సోవియట్ పార్టీ నాయకత్వం అనుసరించుతున్న రివిజనిస్టు విచ్ఛిన్నకర పంథాను ఈ ఘటనలన్నీ విశదం చేస్తున్నాయి.

ప్రస్తుతం సామ్రాజ్యవాదులు, అన్ని దేశాల అభివృద్ధి నిరోధకులు, రివిజనిస్టులూ "చైనా వ్యతిరేకగోల" పెద్ద యెత్తున్న చేస్తున్నారు. మార్క్సిజం-లెనినిజానికి వ్యతిరేకంగా, సోషలిస్టు శిబిరాన్ని, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చడానికై కృశ్చేవ్ నాయకత్వాన సాగుతున్న దుమారం మరింత ఉధృతం చేయబడుతోంది.

## గత ఏడేండ్ల సత్యాలు చాటుతున్న దేమిటి ?

విభేదాలు పుట్టుపూర్వోత్తరాలను పై పేరాల్లో కొంత దీర్ఘంగానే వివరించాము. సోవియట్ పార్టీ కేంద్రకమిటీ వక్రంగా చిత్రించిన వాస్తవాలను వివరించడం, తద్వారా వాస్తవాలను గమనించడంలో మాపార్టీ సభ్యు

లకూ, ప్రజలకూ, ప్రపంచంలోని మార్క్సిస్టు-లెనినిస్టులకూ, విప్లవకారులకూ సహాయపడటం మా లక్ష్యం.

మార్క్సిజం_లెనినిజంనుండి, 1957 పత్రము, 1960 ప్రకటనల నుండి దూరమై, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్ పార్టీ నాయకులు రివిజనిస్టు, విచ్ఛిన్నకర పంథాను అనుసరించినందువల్లనే చైనా - సోవియట్ పార్టీల మధ్య, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ విభేదాలు మొలకెత్తాయని గత ఏడేండ్లలో జరిగిన వాస్తవాలు చాటుతున్నాయి. రివిజనిస్టు, విచ్ఛిన్నకర మార్గంవెంట సోవియట్ పార్టీ నాయకత్వం మరీదూరం వెళ్ళిపోయిన ఫలితంగానే విభేదాలు విస్తృతం అయ్యాయి; సంబంధాలు అధ్వాన్న మయ్యాయి.

నేడు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోవున్న విభేదాలు మార్క్సిజం - లెనినిజానికి కట్టుబడివుండే విధానానికీ, రివిజనిజాన్ని పట్టుకొని వేళ్ళాడే విధానానికీ మధ్య ఏర్పడ్డ విభేదాలు; విప్లవ పంథాకూ విప్లవేతర, విప్లవ ప్రతిఘాతక పంథాలకూ మధ్య గల విభేదాలు; సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాకూ, సామ్రాజ్యవాదానికి లొంగిపోయే పంథాకూ మధ్యగల విభేదాలు; కార్మికవర్గ అంతర్జాతీయతా పంథాకూ అగ్రరాజ్య దురహంకార, ఒంటెత్తువాద విచ్ఛిన్నకర పంథాలకూ మధ్యగల విభేదాలని గత ఏడేండ్ల వాస్తవాలు ధృవపరుస్తున్నాయి.

గత ఏడేండ్లలో సంభవించిన వాస్తవాలు చెబుతున్నదేమంటే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం సోషలిజానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులతో చేతులు కలుపుతున్నది; చైనాకు వ్యతిరేకంగా అమెరికాతో చేతులు కలుపుతున్నది; ప్రపంచ ప్రజానీకానికి వ్యతిరేకంగా అన్నిదేశాల అభివృద్ధి నిరోధకులతో చేతులు కలుపుతున్నది; సోదర మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలకు వ్యతిరేకంగా విద్రోహ టిటో ముఠాతో చేతులు కలుపుతున్నది. సోవియట్ పార్టీ నాయకత్వం అనుసరించుతున్న

ఈ తప్పుడుపంథా ప్రపంచవ్యాప్తంగా రివిజనిస్టు వరదవెల్లువను ప్రవహింపజేసింది: అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని గతంలో ఎన్నడూ లేనంత తీవ్రంగా చీలిపోయేదశకు చేర్చింది. ప్రజాలక్ష్యాలైన ప్రపంచ శాంతి, జాతీయవిముక్తి, జనతా ప్రజాతంత్ర, సోషలిజంలకు తీరని విఘాతం కల్పించింది;

గత ఏడేండ్ల వాస్తవాలు స్పష్టంగా చెబుతున్నదేమంటే, పరిస్థితి మరీ అధ్వాన్నంగాకుండా చేయడానికి చైనాపార్టీ నిరంతరమూ కృషిచేస్తూ వచ్చింది. సిద్ధాంతాలకు కట్టుబడివుంటూ, విభేదాలను తొలగించుకొని ఐక్యతను పెంపొందించుకొంటూ, శత్రువుపైన సమిష్టి పోరాటం సాగించాలన్న సూత్రాన్ని అమలు జరుపుతూ వచ్చింది; పెద్ద ఎత్తున నిగ్రహాన్ని ప్రదర్శిస్తూ, మేము చేయగలిగిందంతా చేశాము.

చైనా – సోవియట పార్టీల మధ్య, చైనా – సోవియట్ దేశాల మధ్య ఐక్యతయొక్క అవసరాన్నిగూర్చి చైనాపార్టీ ఎల్లప్పుడూ నొక్కి చెబుతూనే వుంది. లెనిన్ మహాశయుడు స్థాపించిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అంటే మే మెల్లప్పుడూ గౌరవిస్తూనే వున్నాము. గొప్ప సోవియట్ కమ్యూనిస్టుపార్టీ యెడల, సోవియట్ మహా ప్రజలయెడల మే మెల్లప్పుడూ గాఢమైనకార్మికవర్గ అనురాగశీలతనే అనుసరిస్తూ వచ్చాము. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సోవియట్ ప్రజలూ సాధించిన ప్రతి విజయాన్నీ చూసి మేము ఉత్సాహం పొందాము: సోషలిస్టు శిబిరానికీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికీ నష్టం కలిగించేటట్లు సోవియట్ నాయకత్వం చేసిన ప్రతి తప్పు పనినీ చూసి మేము విచారించాము.

సోవియట్ పార్టీ నాయకత్వం యొక్క తప్పులను చైనా కమ్యూనిస్టు లీనాడు క్రొత్తగా కనిపెట్టలేదు. 20 వ కాంగ్రెసునుండి సోవియట్ పార్టీ నాయకత్వం రివిజనిస్టు మార్గంలో పడిపోవడాన్ని మేము ఆందోళనతో గమనిస్తున్నాము.

ఈ పరిస్థితిలో లెఖ్ఖలేనన్నిసార్లు, దీర్ఘకాలంగా మే మొక ప్రశ్నను గురించి ఆలోచించాము: మనం ఏమిచేయాలి?

మేమిలా తర్కించుకున్నాం : సోవియట్ పార్టీ నాయకత్వాన్నే మనమూ అనుసరించి, వారికోర్కెల కనుగుణంగా మన చర్చలన్నింటినీ మలుచుకుందామా? అలా చేసినట్లయితే సోవియట్ పార్టీ నాయకత్వం ఆనందించేమాట నిజమే; కాని, అప్పుడు మనంగూడ రివిజనిస్టులుగా తయారుకామా!

మాకు మేము మరో ప్రశ్న వేసుకున్నాము: సోవియట్ పార్టీ నాయకత్వం చేసే తప్పులయెడల మౌనం వహించుదామా? సోవియట్ నాయకత్వం చేస్తున్న తప్పులు కాకతాళీయమైనవి కావనీ, వ్యక్తిగతమైనవీ స్వల్పమైనవే కావనీ, అవి సిద్ధాంతానికి సంబంధించిన అనేక సమస్యలకు చెందినవీ: మొత్తం సోషలిస్టు శిబిరం యొక్క, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క ప్రయోజనాలకు ప్రమాదం కలిగించేవీ అని మావిశ్వాసం. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సభ్యులుగా ఈ తప్పులను గూర్చి పట్టించుకోకుండా మౌనంగా ఎలా వుండగలం? అలా వున్నట్లయితే, మార్క్సిజం, లెనినిజాన్ని, కార్మికవర్గ అంతర్జాతీయతను పరిరక్షించవలసిన బాధ్యతను విస్మరించడంకాదా?

సోవియట్ పార్టీ నాయకుల తప్పులను మేము విమర్శించితే మా మీద వారు పగబట్టి దాడి చేస్తారని ముందుగానే వూహించాము: తత్ఫలితంగా చైనాలో సోషలిస్టు నిర్మాణానికి అనివార్యంగా తీవ్రమైన దెబ్బ తీస్తారని మాకు ముందుగానే తెలుసు. అయితే కమ్యూనిస్టులు స్వప్రయోజనాలనే ప్రధానమని ఎంచుకోవాలా? పగబట్టి దాడిచేస్తారన్న భయంతో సత్యాన్ని చెప్పడానికి జంకాలా? కమ్యూనిస్టులు సిద్ధాంతాలను తెగనమ్ముకోవాలా?

మే మొక వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకొనేవున్నాము: సోవియట్

కమ్యూనిస్టుపార్టీ లెనిన్ స్థాపించినట్టిది: అది మొట్టమొదటి సోషలిస్టు రాజ్యానికి చెందినట్టిది: అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ, ప్రపంచ ప్రజల్లోనూ గొప్ప ప్రతిష్ఠను కలిగివున్నది. అందువల్ల సోవియట్ పార్టీ నాయకుల్ని విమర్శించడంలో మేము ప్రత్యేక జాగ్రత్తలు తీసుకున్నాము: ఓపికను వహించాము: సోవియట్, చైనా పార్టీల నాయకుల మధ్య సాగే అంతరంగిక సంప్రదింపులకే ఆ విమర్శను పరిమితం చేయటానికి ప్రయత్నించాము: బహిరంగ వాదోపవాదాలకు దిగకుండా అంతరంగిక చర్చల ద్వారానే విభేదాలు పరిష్కరించుకొనడానికి ప్రయత్నించాము.

అంతరంగిక పార్టీ చర్చల్లో అనేకసార్లు సోవియట్ పార్టీ నాయకులకు చైనాపార్టీ కేంద్రకమిటీకి చెందిన బాధ్యులు సోదర పూర్వకమైన విమర్శనూ, సలహానూ అందజేశారు: కాని, వారిని సరైన మార్గానికి రప్పించడంలో జయప్రదం కాలేకపోయారు. సోవియట్ పార్టీ నాయకులు రివిజనిస్టు, విచ్ఛిన్నకర మార్గంవెంట చాలదూరం వెళ్ళిపోయారు. సహృదయంతో మేము అందజేసిన సలహాకు ప్రతిఫలంగా వారు మాపైన రాజకీయ, ఆర్థిక, సైనిక ఒత్తుళ్ళు వరుసనే తెచ్చారు; పోనుపోను మరింత దారుణమైన దాడులు సాగిస్తూ వచ్చారు.

సోవియట్ పార్టీ నాయకులకొక చెడ్డఅలవాటుంది: వారిని విమర్శించిన వారికల్లా విచక్షణా రహితంగా ఏవో ముద్రలు తగిలిస్తూంటారు.

"మీరు సోవియట్ వ్యతిరేకులు." అంటారు. మిత్రులారా, అది నిజంకాదు. "సోవియట్ వ్యతిరేక" ముద్ర మాకు అంటించలేరు. మేము మీ తప్పులను విమర్శించడంలో గల ఉద్దేశం గొప్ప సోవియట్ కమ్యూనిస్టు పార్టీనీ, గొప్ప సోవియట్ యూనియన్‌నూ సమర్థించటానికే: మీ వల్ల సోవియట్ పార్టీ, సోవియట్ యూనియన్‌ల ప్రతిష్ట దారుణంగా దెబ్బ తినకుండా చూడ్డానికే. నిర్మొహమాటంగా చెప్పాలంటే సోవియట్ వ్యతి

రేకులము మేముకాదు మీరే: సోవియట్ పార్టీనీ: సోవియట్ యూని యన్‌నూ అప్రతిష్ట పాలుచేస్తున్నది మీరే. 20వ కాంగ్రెసులో స్టాలిన్ పాత్రను పూర్తిగా నిరాకరించిన అనంతరం మీరు లెఖ్ఖలేనన్ని తప్పుపనులు చేశారు. సోవియట్ కమూనిస్టు పార్టీకి, సోవియట్ యూనియన్‌కూ మీరు తెచ్చిన అవమానం వోల్గానది నీరంతాపెట్టి కడిగినా పోదు.

వాళ్ళంటారూ, "మీరు నాయకత్వం గుంజుకోటానికి ప్రయత్నిస్తు న్నారు" అని, మిత్రులారా, అది నిజంకాదు. ఈ నిందవేయడం తెలివైన పనికాదు. "నాయకత్వం" కొరకు కొందరుమీతో పోటీ పడుతున్నట్లు మీ వాదన చెబుతున్నది. దీనర్థం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో "నాయకత్వం" అనే దొకటున్నదనీ, అది మీ చేతుల్లో వున్నదనీ, మీరు సిగ్గువిడిచి చెప్పడంకాదా? మీ దొక తండ్రి వంటి పార్టీ అనే జబర్దస్తీగా ప్రవర్తించే చాలా చెడ్డ అలవాటు మీకుంది. అది పూర్తిగా అసంబద్ధం. అన్ని కమ్యూనిస్టుపార్టీలూ స్వతంత్రమైనవీ, సమానమైనవీ నని 1957 పత్రమూ, 1960 ప్రకటనా స్పష్టంగా చెబుతున్నాయి. ఈ సిద్ధాంతం ప్రకారం సోదరపార్టీల మధ్య వుండవలసిన సంబంధాల్లో ఒకరు నాయకు లనీ, తక్కినవారు నడపబడే వారనిగానీ, అంతకంటే, ఒకరు తండ్రి, తక్కినవారు పుత్రులనిగానీ అసలే భావించరాదు. ఒకపార్టీ ఇతర సోదర పార్టీలపైన పెత్తనం చెలాయించే ఆ ధోరణిని మేము ఎల్లప్పుడూ వ్యతిరే కిస్తూ వచ్చాము, ఇతర సోదరపార్టీలపైన పెత్తనం చెలాయించాలన్న భావం మాలో ఎన్నడూలేదు; అందువల్ల నాయకత్వం కోసమై పోటీపడే సమస్య అసలు ఉదయించనే ఉదయించదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని నేడెదుర్కొంటున్న సమస్య ఏపార్టీ నాయకత్వం వహించా లన్నది కాదు: రివిజనిజం దుద్దుకర్రకు దడిసి, అందుకు తలూపడమా లేక మాస్కో పత్రమూ, ప్రకటనల్లోని విప్లవ సిద్ధాంతాలను నిలబెట్టుకొంటూ, మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవ పంథాకొరకై పట్టుదలతో పనిచేయడమా

అన్నదే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని నే డెదుర్కొంటున్న సమస్య. సోదర పార్టీలపైన సోవియట్ పార్టీ నాయకత్వం జబర్దస్తీ చేయ ప్రయత్నిస్తున్నదనీ, తమ రివిజనిస్టు విచ్ఛిన్నకర పంథాను వారిమీద రుద్ద ప్రయత్నిస్తున్నదనీ మా విమర్శ. మేము కోరుకొనేదల్లా మాస్కో పత్రమూ, ప్రకటనలలో పొందుపరచిన విధంగా సోదరపార్టీలన్నీ స్వతంత్రమైనవిగానూ, సమానమైనవిగానూ వుండాలనేదే. మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయతల ప్రాతిపదికపైన సోదరపార్టీలమధ్య సూత్రబద్ధమైన ఐక్యత అవసరమని మే మంటున్నాము.

నేడు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సాగుతున్న బృహద్వివాదాన్ని రెచ్చగొట్టింది, విస్తృత పరిచింది, దాన్ని మాపైన రుద్దింది, సోవియట్ పార్టీ నాయకత్వమే. వారు మాపైన పెద్ద ఎత్తున దాడి చేశారు; అన్నిరకాల దురుద్దేశ పూర్వకమైన నిందారోపణలు మాపైన చేశారు. మార్క్సిజం-లెనినిజాన్ని, కార్మికవర్గ అంతర్జాతీయతనూ వదలివేశారు; మాస్కో పత్రాన్ని, ప్రకటననూ చించి పారవేశారు; ఈ పరిస్థితుల్లో సమాధానం చెప్పకుండా, వారి అపవాదులను ఖండించకుండా, మాస్కో పత్రమూ, ప్రకటనలను బలపరచకుండా, మార్క్సిజం-లెనినిజాన్ని పరిరక్షించకుండా మే మెలా ఉండగలము? మేము మిన్నకుండాలని సోవియట్ నాయకత్వం ఎందుకు ఊహించాలి? చర్చ ప్రారంభమైంది: తప్పులేవో ఒప్పులేవో కూలంకషంగా తేల్చుకోవలసిందే.

చైనా కమ్యూనిస్టులమైన మా వైఖరేమంటే సిద్ధాంతం కొరకు పట్టుదలగా పోరాడడం, ఐక్యతకొరకు కృషిచేయడం; గతంలో మే మా విధంగా చేశాము; ఇప్పుడు అదేపని చేస్తున్నాము: భవిష్యత్తులో కూడా అదే పనిచేస్తాము. సో.క.పా. నాయకత్వంతో సిద్ధాంతవాగ్వివాదాలకు మేము దిగినప్పటికీ తాము అత్యంత ప్రమాదకరమైన మార్గాన్ని పట్టుకొని పోతున్నట్లు వారు గుర్తిస్తారన్న ఆశ మాకింకా వున్నది; విప్లవాన్ని నిరాకరించి

ప్రపంచములోని విప్లవకాముక ప్రజలను త్రోసిరాజని, సోషలిస్టు శిబిరం ఐక్యతనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను విరాకరించి, సామ్రాజ్యవాదులతోనూ, అన్ని దేశాల అభివృద్ధి నిరోధకులతోనూ, విద్రోహి టిటో ముఠాతోనూ మిలాకత్ కావడానికి అతురత చూపే మార్గం వెంటబడి తాము పోతున్నట్లు సోవియట్ పార్టీ నాయకత్వం గుర్తిస్తుందని మేము ఆశిస్తున్నాము.

చైనా, సోవియట్ ప్రజల ప్రయోజనాల దృష్ట్యానూ, సోషలిస్టు శిబిరం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాల దృష్ట్యానూ, కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీలన్నీ ఐక్యంగా వుండి, ఉమ్మడి శత్రువులను వ్యతిరేకించడం అవసరం.

తమ తప్పులను సరిదిద్దుకొమ్మనీ, మార్క్సిజం-లెనినిజం మార్గానికి, కార్మికవర్గ అంతర్జాతీయతా, 1957 పత్రమూ, 1960 ప్రకటనల మార్గానికి తిరిగి రమ్మని సోవియట్ పార్టీ నాయకత్వానికి మేము హృదయపూర్వకంగా మరొక్కసారి విజ్ఞప్తి చేస్తున్నాము.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం నేడు ముఖ్యదశలో వుంది. నేడు జరుగుతున్న చర్చ ప్రపంచ కార్మికవర్గ విప్లవం, మానవజాతి గమ్యాలపైన కీలకమైన ప్రభావం కలిగివుంది. ఈ మహత్తర చర్చ అనంతరం మార్క్సిజం-లెనినిజం మరింత గొప్పగా ప్రకాశించుతుందనీ, అంతర్జాతీయ కార్మికవర్గమూ, ప్రపంచ ప్రజలూ విప్లవములో ఇంకా మహత్తర విజయాలు సాధించుతారనీ చరిత్ర నిరూపించుతుంది.

# అనుబంధం I

## శాంతియుత పరివర్తనపై మా అభిప్రాయాలు

నవంబరు 10, 1957

1. పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తనచెందే సమస్యనుగూర్చి చర్చించేటప్పుడు కేవలం ఒకే మార్గంకంటే రెండురకాల

మార్గాలనూ ప్రస్తావించడం శ్రేయస్కరం. అవి శాంతియుత పరివర్తన, శాంత్యేతర పరివర్తనలు. ఈ పద్ధతివల్ల ఎప్పుడైనా రాజకీయ చొరవ మన చేతుల్లోనే అట్టిపెట్టుకో గలుగుతాము.

(ఎ) శాంతియుత పరివర్తనను గురించి ప్రస్తావించడంవల్ల ఆత్మ రక్షణకొరకే ప్రధానంగా మనం హింసను ప్రయోగిస్తామని అర్ధమౌతుంది. అందువల్ల పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలు ఈ సమస్యపై తమపైసాగే దాడిని తిప్పికొట్టవచ్చు. ఇది రాజకీయంగా మనకు ప్రయో జనకారిగూడా. ప్రజలను మనవైపుకు తిప్పుకోవచ్చు, దాడి సాగించటానికై బూర్జువావర్గం చేసే కుంటి వాదనను ఎదుర్కొని, ఆ అవకాశం ఆ వర్గాని కివ్వకుండా చూడొచ్చు.

(బి) అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులు పెద్దగా మారిపోయి, ఒకానొక దేశంలో శాంతియుత పరివర్తనకు ఆచరణలో అవకాశాలు ఏర్పడి నప్పుడు ఆ అవకాశాన్ని సకాలంలో సద్వినియోగం చేసుకొని, ప్రజల అభిమానాన్ని సంపాదించి, శాంతియుత పద్ధతుల్లో రాజ్యాధికార సమస్యను పరిష్కరించుకోవచ్చు.

(సి) అయితే, ఈ కోర్కెను మనసులో పెట్టుకొని మన చేతుల్ని మనమే కట్టివేసుకోరాదు. చారిత్రక దశనుండి తనంతట తానుగా బూర్జువా వర్గం తప్పుకోదు. ఇది వర్గపోరాటానికి సంబంధించిన విశ్వజనీన సూత్రం. ఏ రూపంలో నైనా విప్లవాన్ని పూర్తిచేయడానికై చేసే సన్నాహాలను కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గమూ సడలించరాదు. విప్లవ ప్రతీఘాతక దాడు లను తిప్పికొట్టటానికి వారు ఎల్లప్పుడూ సర్వసన్నద్ధంగా వుండాలి. కార్మిక వర్గం రాజ్యాధికారాన్ని చేబట్టబోయే క్లిష్ట సమయంలో ప్రజావిప్లవాన్ని అణచడానికై బూర్జువావర్గం సాయుధశక్తిని ప్రయోగించితే. అలాంటప్పుడు బూర్జువావర్గాన్ని సాయుధశక్తిద్వారా కూలదోయడానికి సర్వసన్నద్ధంగా వుండాలి. (సర్వసాధారణంగా బూర్జువావర్గం సాయుధశక్తిని వినియోగిం చటం అనివార్యం.)

2. నేటి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం వున్న పరిస్థితుల్లో ఎత్తుగడల రీత్యా శాంతియుత పరివర్తనా కోర్కెను ప్రస్తావించడం లాభదాయకం. అయితే శాంతియుత పరివర్తనావకాశాన్ని అతిగా నొక్కిచెప్పడం సరికాదు. అందుకు కారణాలేమంటే:

(ఎ) అవకాశాలూ, వాస్తవాలూ-కోరికా, దాని సాధ్యాసాధ్యాలూ అనేవి రెండూ వేరువేరైన విషయాలు. శాంతియుత పరివర్తనా కోర్కెను మనం వ్యక్తంచేయాలి. అయితే, మన ఆశలన్నీ ప్రధానంగా దానిమీదనే పెట్టుకోరాదు. అందువల్ల దాన్నిగూర్చి అతిగా నొక్కి చెప్పరాదు.

(బి) శాంతియుత పరివర్తనపైనే అతిగా నొక్కి చెప్పితే ముఖ్యంగా పార్లమెంటులో మెజారిటీ ద్వారానే రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవాలని అతిగా నొక్కి చెప్పినందువల్ల కార్మికవర్గంయొక్క, శ్రామిక జనుల యొక్క, కమ్యూనిస్టుపార్టీయొక్క విప్లవ భావాలు బలహీనపడే ప్రమాదముంది. వారిని సిద్ధాంతరీత్యా నిరాయుధంచేసే ప్రమాదముంది.

(సి) మాకు తెలిసినంతవరకూ, ఏ వొక్క దేశంలోనూ ఈ అవకాశం ఆచరణాత్మక ప్రాధాన్యాన్ని అందుకొనలేదు. ఏ ప్రత్యేక దేశంలోనైనా ఈ అవకాశం కొంచెం కనిపించినప్పటికి దానిపై అతిగా నొక్కి చెప్పడం సరికాదు. ఎందువల్లనంటే, అత్యధిక సంఖ్యాక దేశాల్లో వాస్తవాలు ఈ అవకాశానికి విరుద్ధంగా వున్నాయి. ఏ దేశంలోనైనా ఈ అవకాశం నిజంగా ఏర్పడినట్లయితే, అక్కడి కమ్యూనిస్టుపార్టీ దాన్ని వినియోగించు కొనడానికొక వంక ప్రయత్నిస్తూనే, మరోవంక బూర్జువావర్గం ప్రయోగించే దాడులను తిప్పికొట్టడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా వుండాలి.

(డి) ఈ అవకాశాన్ని (శాంతియుత పరివర్తనావకాశం) అతిగా నొక్కి చెప్పినందువల్ల బూర్జువావర్గం యొక్క అభివృద్ధి నిరోధక స్వభావాన్ని తగ్గించనూలేము. వారిని జోకొట్టనూలేము.

(ఇ) ఈ అవకాశాన్ని గూర్చి అతిగా నొక్కి చెప్పినందువల్ల సోషల్ డెమోక్రటిక్ పార్టీలు విప్లవ పార్టీలుగా తయారుకానూలేవు.

(యఫ్) ఈ అవకాశాన్ని గూర్చి అతిగా నొక్కి చెప్పినందువల్ల కమ్యూనిస్టుపార్టీలు పటిష్టవంతం కాలేవుగూడా. అందుకు భిన్నంగా జరుగుతుంది. ఈ అవకాశాన్ని అతిగా నొక్కి చెప్పిన ఫలితంగా కమ్యూనిస్టు పార్టీలు తమ విప్లవ లక్షణాలను పోగొట్టుకున్నట్లయితే ప్రజల దృష్టిలో సోషల్ డెమోక్రాటిక్ పార్టీలుగా పరిగణింపబడితే ఆ పార్టీలు బలహీన పడిపోతాయి.

(జి) విప్లవ శక్తులను కూడగట్టి, విప్లవానికి సన్నద్ధం గావటం చాల కష్టమైన పని. పార్లమెంటరీ పోరాటం విప్లవ పోరాటంతో సరిపోల్చితే సులువైనదే. పార్లమెంటరీ పోరాట రూపాన్ని మనం సంపూర్తిగా వినియోగించుకోవలసిందే. అయితే, దానిపాత్ర పరిమితమైనది. విప్లవ శక్తులను సమీకరించే కష్టమైన మార్గాన ముందుకు పోవడమే అత్యంత ప్రాముఖ్యం గల విషయం.

3. పార్లమెంటులో మెజారిటీ సంపాదించడమంటే, పాతరాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేయడమూ కాదు, (ముఖ్యంగా సాయుధశక్తులు) కొత్త రాజ్యాంగ యంత్రాన్ని స్థాపించడమూకాదు. (ముఖ్యంగా సాయుధ శక్తులు) బూర్జువావర్గంయొక్క సైనిక-నిరంకుశ రాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేయనిదే కార్మికవర్గానికీ, వారి నమ్మకమైన మిత్రులకు పార్లమెంటులో మెజారిటీ సంపాదించడం అసంభవమైనా అవుతుంది. (యెందుకంటే, తన నియంతృత్వాన్ని శాశ్వతం చేసుకునేందుకై అవసరమైనప్పుడల్లా బూర్జువా వర్గం రాజ్యాంగాన్ని సవరించుతుంది) లేదా, వచ్చిన మెజారిటీ ఆధారపడరానిదిగానైనా తయారౌతుంది. (ఉదాహరణకు, ఎన్నికశే చెల్లనేరవని ప్రకటించవచ్చు. కమ్యూనిస్టుపార్టీని నిషేధించవచ్చు. పార్లమెంటునే రద్దుచేయవచ్చు, ఇలాంటివే మరికొన్ని చేయవచ్చు.)

4. సోషలిజానికి శాంతియుత పరివర్తన అనగా, పార్లమెంటరీ మెజారిటీద్వారా మాత్రమేనని భాష్యం చెప్పడంకూడ సరైందికాదు.

ప్రధానసమస్య రాజ్యాంగ యంత్రం. బ్రిటన్‌లో శాంతియుత పద్ధతుల ద్వారా సోషలిజాన్ని సాధించే అవకాశా లున్నాయని 1870 ప్రాంతంలో మార్క్స్ భావించాడు. ఎందుకంటే, "ఆ సమయంలో ఇతర అన్ని దేశాల్లోకంటే బ్రిటన్‌లో-సైనిక నిరంకుశ వ్యవస్థ తక్కువ స్థాయిలో ఉన్నది." ఫిబ్రవరి విప్లవానంతరం, "అన్ని అధికారాలూ సోవియట్లకే" అన్న నినాదంలో విప్లవం శాంతియుతంగా అభివృద్ధి చెంది విజయం పొందుతుందని కొంతకాలంపాటు లెనిన్ భావించాడు. ఎందువల్లనంటే ఆ సమయంలో "ఆయుధాలు ప్రజల చేతులలోనే ఉన్నాయి." పాత రాజ్యాంగ యంత్రాన్ని ఉపయోగించుకోవడం ద్వారానే శాంతియుత పరివర్తనను సాధించవచ్చునని మార్క్స్‌గాని, లెనిన్‌గాని భావించలేదు. మార్క్స్ ఎంగెల్సు బోధనను లెనిన్ పదేపదే వివరించాడు. "కార్మికవర్గం చేయవలసింది; తయారై సిద్ధంగా (రెడీమేడ్) వున్న పాత రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీనం చేసుకొని, తన లక్ష్యాలకొరకై దాన్ని వినియోగించు కొనడం కాదు."

5. సోషల్ డెమోక్రాటిక్ పార్టీలు సోషలిజం స్థాపనకై ఏర్పడిన పార్టీలు కాదు. అందులో వుండే కొందరు వామపక్షీయులు మినహా, ఆ పార్టీలన్నీ బూర్జువావర్గానికీ, పెట్టుబడిదారీ విధానానికీ ఊడిగం చేసే పార్టీలు. బూర్జువా రాజకీయ పార్టీలకు రూపాంతరాలు మాత్రమే. సోషలిస్టు విప్లవ సమస్యపై మన వైఖరి సోషల్ డెమోక్రాటిక్ పార్టీలతో మూలంలోనే విభేదిస్తుంది" ఈ తేడాను విస్మరించరాదు. ఈ తేడాను విస్మరిస్తే అది, సోషల్ డెమోక్రాటిక్ పార్టీల నాయకులు ప్రజలను మోసంచేయడానికి మాత్రమే తోడ్పడుతుంది. సోషల్ డెమోక్రాటిక్ పార్టీల దుష్ప్రభావం నుండి ప్రజలను మనవైపుకు తిప్పుకోవడం కష్టమౌతుంది. ఏమైనా, సోషల్ డెమోక్రాటిక్ పార్టీల విషయంలో మన పనిని పటిష్టవంతం చేసుకొనడమూ, వాటి వామపక్ష, మధ్యస్థ గ్రూపులతో ఐక్య సంఘటన ఏర్పర్చుకొనటానికి కృషిచేయడమూ అవసరమనేది నిర్వివాదాంశం.

6. ఈ సమస్యయెడల మా అవగాహన అది. ఈ సమస్యపైన మాది భిన్నాభిప్రాయమే. అయితే, అనేక కారణాల దృష్ట్యా సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెసు తర్వాత మా భావాలను మేము ప్రకటించలేదు. సంయుక్త ప్రకటన విడుదల చేయవలసిఉన్నందువల్ల ఇప్పుడు మా అభిప్రాయాలను వివరించుకోవలసి వచ్చింది. ఏమైనా దీనివల్ల, పత్రం ముసాయిదాలో ఏకాభిప్రాయాన్ని పొందుపర్చడంలో ఇది అడ్డంకి కానవసరంలేదు, ముసాయిదా పత్రంలో పొందుపరచబోయే సూత్రీకరణకూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెసు చేసిన సూత్రీకరణకూ మధ్య సామ్యం ఉండాలన్న ఉద్దేశంతో నే సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ నేడు ప్రతిపాదించిన ముసాయిదాను చర్చకు ప్రాతిపదికగా తీసుకొనటానికి మేము అంగీకరిస్తున్నాము. అదే సమయంలో దానికి కొన్నిచోట్ల సవరణలు ప్రతిపాదిస్తున్నాము.

# అనుబంధం 2

## బుఖారెస్టులో జరిగిన సోదరపార్టీల సమావేశ సందర్భంలో చైనా కమ్యూనిస్టు విడుదల చేసిన ప్రకటన

జూన్. 26, 1960

1. ఉమ్మడి సమస్యలను సోదరపార్టీలమధ్య సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవాలన్న సూత్రం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చాలాకాలంనుండి ఆచరించబడుతున్నది; అలాంటి సూత్రాన్ని సోవియట్

కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రతినిధివర్గానికి చెందిన కామ్రేడ్ కృశ్చేవ్ ఈ సమావేశంలో పూర్తిగా ఉల్లంఘించారని చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ భావిస్తున్నది; సమావేశాన్ని పరస్పర అభిప్రాయ వ్యక్తీకరణకు మాత్రమే పరిమితం చేయాలనీ, ఎలాంటి నిర్ణయాలు చేయరాదనీ మొదట్లో చేసుకున్న ఒప్పందాన్నికూడా, ఆయన పూర్తిగా అతిక్రమించారు. ఈ సమావేశం తరఫున ఒక ప్రకటన ముసాయిదాను ఆకస్మికంగా ప్రతిపాదించడంద్వారా ఆయన ఆ పని చేశారు. ప్రతిపాదించే ముందు అందులోని విషయాలపై సోదరపార్టీలతో సంప్రదించలేదు. అంతేగాక దానిపై సమగ్రమైన సాధారణ చర్చ జరగనీయలేదు. లెనిన్ కాలంనుండి అనేక సంవత్సరాల కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్ పార్టీ సాధించిన ప్రతిష్టను ఇది దుర్వినియోగ పరచుకొనడమే. అంతేగాక, తమ యిష్టాయిష్టాలను ఇతరులపై రుద్దే అతి మొరటుచర్య ఇది. ఈ ధోరణికీ, లెనిన్ తరహా పనివిధానానికీ ఎంతమాత్రమూ సామ్యంలేదు; ఈ విధమైన ప్రవర్తన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మున్నెన్నడూలేని చెడు సాంప్రదాయాన్ని సృష్టించుతుంది. కామ్రేడ్ కృశ్చేవ్ ప్రదర్శించిన ధోరణి, ప్రవర్తించిన తీరూ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి అత్యంత తీవ్రమైన దుష్పరిమాణాలు జేస్తాయని చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అభిప్రాయ పడుతున్నది.

2. చైనా కమ్యూనిస్టుపార్టీ ఎల్లప్పుడూ మార్క్సిజం-లెనినిజంకు కట్టుబడి వుంటున్నది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత వైఖరులను అచ్చితంగా అమలు జరుపుతున్నది. గతరెండు సంవత్సరాలకు పైబడినకాలంలో 1957లో రూపొందించిన మాస్కో పత్రానికి పూర్తి విధేయతతో పనిచేస్తున్నది. ఆ పత్రంలోని మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రీకరణలను గట్టిగా అమలు జరుపుతున్నది. మార్క్సిజం-లెనినిజంకు సంబంధించిన అనేక మూలసిద్ధాంతాలపైన మాకూ కామ్రేడ్ కృశ్చేవ్‌కూ మధ్య భేదాభిప్రాయా

లున్నాయి. మొత్తం సోషలిస్టు శిబిరంపైనా, ప్రపంచ కార్మికవర్గమూ శ్రామిక ప్రజల ప్రయోజనాలపైనా ప్రపంచ ప్రజలంతా ప్రపంచ శాంతిని పరిరక్షించుకొనగలుగుతారా లేదా, సామ్రాజ్యవాదులు మరో ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించకుండా ప్రపంచ ప్రజలు చేయగలుగు తారా లేదా అనే సమస్యపైనా, ప్రపంచ జనాభాలో మూడింట రెండువంతులు, ప్రపంచ వైశాల్యంలో నాలుగింట మూడు వంతులుగల పెట్టుబడిదారీ ప్రపంచంలో సోషలిజం విజయాలు సాగించుతూనే వుంటుందా లేదా అనే సమస్యపైనా- వీటన్నిటిపైనా ఈ భేదాభిప్రాయాలు పెద్ద ప్రభావాన్ని కలిగివుంటాయి. ఈ భేదాభిప్రాయాల యెడల మార్క్సిస్టు-లెనినిస్టు లందరూ తీవ్రంగా ఆలోచించవలసి వుంటుంది; సోదరపూర్వకమైన చర్చలు జరుపవలసి ఉంటుంది. తద్వారా ఏకగ్రీవమైన నిర్ణయాలకు రావటానికి ప్రయ త్నించవలసి వుంటుంది. కాని, కామ్రేడ్ కృశ్చేవ్, కుమారుని యెడల తండ్రి అనుసరించే ధోరణిని ప్రవర్శించారు. అది నిరంకుశమైన, పెత్తందారీ ధోరణి. గొప్ప సోవియట్ పార్టీకి, మాపార్టీకి మధ్యగల సంబం ధాలు సోదరుల మధ్య వుండెవిగా గాక, తండ్రీ కొడుకుల సంబంధాలుగా ఆయన భావిస్తున్నారు. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలకు భిన్నమైన తన భావాల కనుకూలంగా మాపార్టీని లొంగదీసుకోవాలని ఈ సమావేశంలో ఆయన పెద్ద వత్తిడి తెచ్చారు. మార్క్సిజం-లెనినిజాన్ని మాపార్టీ విశ్వసి స్తున్నదనీ, మార్క్సిజం లెనినిజానికి మాత్రమే మా పార్టీ విధేయత చూపుతుందనీ మేము హృదయపూర్వకంగా ప్రకటిస్తున్నాము. మార్క్సిజం లెనినిజానికి విరుద్ధంగా వెళ్ళే ఎలాంటి తప్పుభావాలకూ మాపార్టీ తలొగ్గ దని స్పష్టపరుస్తున్నాము. రుమేనియాపార్టీ 3 వ మహాసభలో కామ్రేడ్ కృశ్చేవ్ వెలిబుచ్చిన కొన్ని భావాలు తప్పు అనీ, మాస్కో పత్రానికి విరుద్ధమనీ మేము అభిప్రాయపడుచున్నాము. ఆయన ప్రసంగానికి సామ్రాజ్యవాదులు, టిటోముఠా హర్షం ప్రకటిస్తారు. వాస్తవంలో ఇప్ప

టికే అలా ప్రకటించారుగూడా. కామ్రేడ్ కృశ్చేవ్‌తో మాకుగల భేదాభిప్రాయాలను అవకాశం వచ్చినప్పుడు సోవియట్ పార్టీతోనూ, ఇతర సోదర పార్టీలతోనూ మేము చర్చిస్తాము. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి రాసి, బుఖారెస్టులో పంపిణీ చేసినట్టి సమాచార లేఖను క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాత దానికి చైనా పార్టీ కేంద్రకమిటీ వివరమైన జవాబు ఇస్తుంది. రెండు పార్టీలకూ మధ్యగల సిద్ధాంత విభేదాలను జవాబులో వివరించడమూ, అందుకు సంబంధించిన వాస్తవాలను అందించడమూ చైనాపార్టీ కేంద్రకమిటీ జవాబులో వుంటాయి. సోదర పార్టీలతో చైనా కమ్యూనిస్టుపార్టీ చిత్తశుద్ధితోనూ, కామ్రేడ్లీ వాతావరణంలోనూ, తీవ్రంగానూ చర్చలు జరుపుతుంది. ఏది ఏమైనా మార్క్సిస్టు-లెనినిస్టు సత్యాలు తుదకు విజయంపొంది తీరుతాయని మా విశ్వాసం. సవాలునుచూసి వాస్తవమెన్నడూ భయపడదు. చివరకు సత్యాన్ని తప్పుగానూ, తప్పును సత్యంగానూ చిత్రించడం అసాధ్యం. అన్నిదేశాల ప్రజల అవసరాలు పోరాటాలపైనా, మార్క్సిజం-లెనినిజం అందించే గైడెన్స్ (మార్గదర్శకత్వం) పైనా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఆధారపడి వున్నదేగాని, ఏవొక్క వ్యక్తి ఆడించే దుడ్డుగర్రపైన మాత్రంకాదు.

3. అన్ని కమ్యూనిస్టుపార్టీలమధ్య అన్ని సోషలిస్టు దేశాలమధ్య ఐక్యతను కాపాడటానికై చైనా కమ్యూనిస్టులమైన మేము కృషిచేస్తూ వచ్చాము. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో నిజమైన ఐక్యత కొరకూ, సామ్రాజ్యవాదానికీ, అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటం సాగించటానికై భేదాభిప్రాయాలపైన సాధారణ చర్చలు జరపాలనీ, సిద్ధాంతానికి సంబంధించిన తీవ్రమైన సమస్యలపైన అదరాబాదరాగా, అసాధారణమైన పద్ధతులద్వారాగానీ, లేక కేవలం ఓటింగు ద్వారాగానీ తేల్చిపారెయ్యరాదని మేము భావిస్తున్నాము. అలాగే, ఆచరణ

పరీక్షలో నెగ్గని వ్యక్తిగత భావాలను, ఆచరణలో తప్పు అని తేలిపోయిన భావాలనూ ఇతరులపై నిరంకుశంగా రుద్దరాదు. ఈ సమావేశంలో కామ్రేడ్ కృశ్చేవ్ అనుసరించిన వైఖరి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు విఘాతం కలిగిస్తుంది. కామ్రేడ్ కృశ్చేవ్ ఎలా ప్రవర్తించినప్పటికీ, సోవియట్, చైనా కమ్యూనిస్టుపార్టీల ఐక్యతా, అన్ని కమ్యూనిస్టు పార్టీల ఐక్యతా మరింత బలపడి అభివృద్ధి చెంది తీరుతుంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమమూ, మార్క్సిజం- లెనినిజమూ అభివృద్ధి పొందేకొలదీ మనలో ఐక్యతగూడ ధృడతర మౌతుంది.

4. మన రెండుపార్టీల మధ్యగల సంబంధాలను మొత్తంగా దృష్టిలో పెట్టుకొని చూసినప్పుడు కామ్రేడ్ కృశ్చేవ్‌కూ మాకు మధ్యగల భేదాభిప్రాయాలు పాక్షిక స్వభావం కలిగినవి మాత్రమే. ఉమ్మడి లక్ష్యం కోసమై ఐక్యంగా పోరాటం మన రెండు పార్టీల మధ్యగల ప్రధానాంశం. ఎందుకంటే మనవి రెండు సోషలిస్టు దేశాలు. మనవి రెండూ మార్క్సిజం-లెనినిజం ప్రాతిపదికపై నిర్మించబడిన పార్టీలు. ప్రపంచ సోషలిస్టు శిబిరం ప్రయోజనాల కొరకై మన రెండు పార్టీలూ పోరాడుతున్నాయి. సామ్రాజ్యవాద దురాక్రమణను వ్యతిరేకించుతూ, ప్రపంచ శాంతి పరిరక్షణకై కృషిచేస్తున్నాయి. కామ్రేడ్ కృశ్చేవ్, సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ, మేమూ కలిసి ప్రశాంతంగా, సోదర భావంతో చర్చలు జరుపుకొనే అవకాశాలు వస్తాయని మేము విశ్వసిస్తున్నాము. విభేదాలు పరిష్కరించుకొన వచ్చునని భావిస్తున్నాము. ఆ విధంగా చైనా, సోవియట్‌పార్టీలు మరింత ఐక్యంగా పనిచేయాలనీ; వీటి సత్సంబంధాలు మరింత బలపడాలని కోరుకుంటున్నాము. ఇది సోషలిస్టు శిబిరానికీ, సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగానూ, ప్రపంచ శాంతి కోసమూ పోరాడే ప్రపంచ ప్రజలందరికీ ఇది ప్రయోజనకారి.

5. ఈ సమావేశంలో ప్రతిపాదించిన ముసాయిదా ప్రకటనలో

మాస్కో-పత్రం సరియైనదని నొక్కి చెప్పటంపట్ల మేము హర్షం వెలి బుచ్చుతున్నాము. అయితే మాస్కో పత్రంలోని మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రీకరణలను ఈ ముసాయిదాలో తప్పుగానూ, పాక్షికంగానూ వివరించారు. నేటి అంతర్జాతీయ పరిస్థితుల్లో చర్చనీయాంశాలుగా వున్న ప్రధాన సమస్యలపట్ల ఈ ముసాయిదా స్పష్టమైన వైఖరిని తీసుకొనకపోవడం తప్పు. అలాగే అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమంలో ప్రధాన ప్రమాదంగా తయారైన ఆధునిక రివిజనిజాన్ని గూర్చి ముసాయిదా ప్రస్తావించక పోవడంకూడా తప్పు. అందువల్ల ఈ ముసాయిదా మాకు ఆమోదయోగ్యం కాదు. శత్రువుకు వ్యతిరేకంగా సాగించే ఉమ్మడి పోరాటంలో ఐక్యత కోసమై సవరించిన ముసాయిదాను మేము ప్రతిపాదించాము. దాన్ని చర్చించాలని మేము ప్రతిపాదిస్తున్నాము. ఇప్పుడే ఒక అంగీకారానికి రాలేక పోతే ముసాయిదా రచనా సంఘాన్ని ఏర్పరుద్దాము సమగ్రమైన చర్చల అనంతరం అందరికీ ఆమోదయోగ్యమైన ముసాయిదాను ఆ కమిటీ తయారు చేస్తుంది.

# అనుబంధం 3

## సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పంపిన సమాచార లేఖకు సమాధానంగా విభేదాలు తొలగించుకొని, ఐక్యతను సాధించుకొనటానికై చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ చేసిన ఐదు ప్రతిపాదనలు

సెప్టెంబరు 10, 1960

భేదాభిప్రాయాలను పరిష్కరించుకొని, ఐక్యతను సాధించు కొనటానికై మేము ఈ దిగువ ప్రతిపాదనలను హృదయపూర్వకంగా పెడుతున్నాము-

1. మన రెండు పార్టీలమధ్యా, అలాగే అన్ని సోదరపార్టీల మధ్యా ఐక్యతకు మార్క్సిస్టు-లెనినిస్టు మూలసూత్రాలూ; 1957 మాస్కో సమావేశం రూపొందించిన పత్రమూ, మానిఫెస్టో సిద్ధాంత ప్రాతిపదికలుగా ఉన్నాయి. మన మాటలూ, చేతలూ, అన్నికూడా మార్క్సిస్టు-లెనినిస్టు మూలసూత్రాలకూ, మాస్కో పత్రంలోని సిద్ధాంతాలకూ ఖచ్చితంగా అనుగుణంగా ఉండాలి: సత్యాసత్యాలను నిర్ధారణ చేయడంలో అవే గీటురాళ్ళుగా ఉండాలి.

2. సోషలిస్టు దేశాలమధ్య, సోదర పార్టీలమధ్య సంబంధాలు మాస్కోపత్రంలో పొందుపరచిన సమానత్వం, కామ్రేడ్‌షిప్, అంతర్జాతీయ సిద్ధాంతాలకు ఖచ్చితంగా కట్టుబడి వుండాలి.

3. సోషలిస్టు దేశాలమధ్య, సోదరపార్టీలమధ్య తలెత్తే వివాదాలన్నింటినీ మాస్కోపత్రంలో పొందుపరచిన విధంగా తొందరపడకుండా కామ్రేడ్స్ అనే భావంతో చర్చలు జరుపుకొని పరిష్కరించుకోవాలి. అంతర్జాతీయ పరిస్థితి విషయంలోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం విషయంలోనూ సోవియట్ యూనియన్, చైనాలూ, సోవియట్, చైనా పార్టీలూ రెండూ పెద్ద బాధ్యత వహిస్తున్నాయి. కార్యాచరణలో ఐక్యతను

సాధించు కొనేందుకై ముఖ్యమైన ఉమ్మడి సమస్య లన్నింటిని గురించీ సమగ్రమైన సంప్రతింపులూ, తొందరపాటులేని చర్చలూ వారు జరుపు కోవాలి. చైనా, సోవియట్ పార్టీల మధ్యగల వివాదాలు ప్రస్తుతం ఇప్పటి కిప్పుడు పరిష్కారం కాకపోతే తమాయింపుతో కూడిన చర్చలను కొనసా గించాలి. అవసరమని భావించినప్పుడు ఇరుపక్షాల భావాలనూ అన్ని దేశాల కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీలకు సమగ్రంగానూ, వాస్తవికంగానూ తెలియజెయ్యాలి. ఆ విధంగా తీవ్రమైన చర్చల అనంతరం, మార్క్సిజం-లెనినిజం, మాస్కో పత్రంలోని సిద్ధాంతాల కనుగుణంగా ఆ పార్టీలు సరైన తీర్పు నిచ్చేందుకు తోడ్పడాలి.

4 శత్రువుకూ, మనకూ మధ్య వాస్తవానికీ, అబద్ధానికీ మధ్య స్పష్టమైన గీత గీచుకోవడం కమ్యూనిస్టులు ముఖ్యంగా చేయవలసిన పని. మన రెండు పార్టీలూ మన మైత్రికి పెద్ద విలువనివ్వాలి; శత్రువును వ్యతి రేకించడంలో చేతులు కలపాలి. రెండు పార్టీలమధ్యా, దేశాలమధ్యా ఐక్య తను దెబ్బతీసే ప్రకటనలుగానీ, పనులుగానీ ఎవరమూ చేయరాదు; అలాం టివి చేయటం ద్వారా మన మధ్య గండికొట్టే అవకాశం శత్రువు కివ్వరాదు.

5. పైసూత్రాల ప్రాతిపదికపైన మన రెండు పార్టీలు ఇతర కమ్యూ నిస్టు, కార్మికవర్గ పార్టీలతో కలిసి కృషిచేసి, సర్వసన్నాహాలు, సంప్ర తింపులు సాగించుకొని, ఈ సంవత్సరం నవంబరులో మాస్కోలో జరగ బోయే ప్రపంచ కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీల సమావేశాన్ని జయప్రదం చేయాలి; మార్క్సిస్టు-లెనినిస్టు మూల సూత్రాలకూ, 1957 మాస్కో పత్రంలోని సిద్ధాంతాలకూ అనుగుణమైన డాక్యుమెంటును ఆ సమావేశంలో మనం రూపొందించుకోవాలి; అది మనకొక కార్యక్రమంగా వుండాలి; అందుకు మనందరం కట్టుబడి వ్యవహరించాలి: అది శత్రువుకు వ్యతిరే కంగా ఐక్యపోరాటం సాగించే కార్యక్రమంగా తయారవ్వాలి.

[సమాప్తం]

# తప్పక చదవాల్సిన సాహిత్యం

1. చైనా - రష్యా విభేదాల పుట్టు పూర్వోత్తరాలు (1వ కామెంట్) 2-00
2. స్టాలిన్ సమస్యపై సరైన అంచనా ఏది? (2వ కామెంట్) 1-00
3. యుగోస్లావియా సోషలిష్టు దేశమేనా? (3వ కామెంట్) 1-50
4. నయావలస విధాన వకాల్తాదారులు (4వ కామెంట్) 1-00
5. యుద్ధమూ-శాంతి సమస్య యెడల-మార్క్సిస్టు - లెనినిస్టుల వైఖరి (5వ కామెంట్) 1-00
6. శాంతియుత సహజీవనం-రెండుపరస్పర వ్యతిరేక విధానాలు (6వ కామెంట్) 1-25
7. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటులకు కారకులెవరు? (7వ కామెంట్) 2-00
8. కార్మికవర్గ విప్లవం-కృశ్చేవ్ రివిజనిజం (8వ కామెంట్) 1-50
9. కృశ్చేవ్ బూటకపు కమ్యూనిజం — ప్రపంచానికి అది నేర్పుతున్న గుణపాఠాలు (9వ కామెంట్) 2-00
10. చైనా సాంస్కృతిక విప్లవానికి సంబంధించిన డాక్యుమెంట్లు 0-75
11. సోషలిస్టు పంథా? లేక పెట్టుబడిదారీ పంథా? 1-00
12. కార్మికవర్గ నియంతృత్వం గురించి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ బోధనలు 0-50

